# భారత జాతికి ఆశాజ్యోతి

"పేదల కొరకు ఎవడు పరితపించునో
వాడే మహాత్ముడు;
పరితపించనివాడు దురాత్ముడు"
- స్వామి వివేకానంద.

సంకలనము:
మన్నవ గిరిధరరావు.

రామకృష్ణ శారదా కుటీర్
కొత్తగూడెం
ఖమ్మం జిల్లా, ఆం.ప్ర. 507 101

# ముందుమాట

శ్రీ వివేకానందస్వామి హిందూమత విశిష్టత, స్వరూప స్వభావమును అధికారపూర్వకముగా సరళ గంభీర సమన్విత భాషలో చికాగో నగరంలో 1893 వ సం//ములో జరిగిన ''సర్వమతమహాసభ'' లో సనాతన ధర్మ ప్రతినిధిగా పాల్గొని పాశ్చాత్య ఖండవాసులకు వుద్బోధించిన ప్రథమ భారతీయుడు. చికాగోనగరంలోనే గాక యితర పాశ్చాత్యదేశాలలో సనాతన ధర్మ ప్రతిష్టను ద్విగుణీకృత మొనర్చి వేదాంత దుంధుభిని మ్రోగించిన స్వామీజీ ఘనత భారతీయులకు, ప్రపంచ ప్రజలకు విదితమే.

వివేకానందుని భారతదేశ పరిక్రమణ విషయం కొంత మందికే తెలుసును. 1892 సం//లో జరిగిన స్వామీజీ పరిక్రమణ శతసంవత్సరములు పూర్తి అయిన సందర్భంగా అనేక కార్యక్రమములతో దేశమంతటా వుత్సాహము వెల్లివిరిసినది. శతజయంతి ఉత్సవములలో భాగంగా మేము చేపట్టిన కార్యక్రమము, ప్రజా బాహుళ్యానికి స్వామీజీ ఉద్బోధనలు, ప్రసంగములు సులభతరమైన రీతిగా ప్రచారం చేయుట — అందులో భాగంగా శ్రీ మన్నవ గిరిధరరావు గారిచే రచింపబడిన ''భారత జాతికి ఆశాజ్యోతి'' అనే యీ చిన్న పొత్తము ప్రచురించడమైనది. స్వామి వివేకానందుని రచనలు అధ్యయనం చేసి గ్రంథకర్త యీ చిన్న పొత్తములో ఆణిముత్యాలవంటి వివేకానందుని సందేశాలు, కొన్ని అమృతవాక్కులు, ముఖ్యంగా యువశక్తిని వుత్తేజపరుస్తూ స్వామీజీ సందేశాలు ఎంతో సులభశైలిలో పొందుపరచినారు. శ్రీ వివేకానందుడు ''ఆశాజ్యోతి ఒక్క భారతజాతికే కాదు. యావత్ ప్రపంచదేశాలకే ''శాశ్వత విజ్ఞానజ్యోతి'' **''(Eternal Wisdom light)''** అని ప్రస్తుతం సర్వత్రా ప్రబలిన అస్తవ్యస్త పరిస్థితుల దృష్ట్యా నిర్ద్వందముగా చెప్పవచ్చును. ఆయన అసాధారణ వ్యక్తిత్వం, మానవత్వం, దేశభక్తి ఆత్మవిశ్వాసం, అంతర్లీనమైవున్న హిందూమత ధార్మికసిద్ధాంతం, త్యాగము, దళితప్రజల పురోభివృద్ధి, దేశాభివృద్ధి మొదలుగాగల అంశములపై యీ చిన్న ప్రచురణలో తగురీతిని పొందుపర్చడమైనది.

శ్రీ స్వామివారి భారతదేశ పరిక్రమణ (1892 సం//) జరిగి శతసంవత్సరములు పూర్తి అయినవి. ఆయన తన పరివ్రాజక జీవితంలో భారతప్రజల

దుస్థితి గాంచి తీవ్రమైన ఆందోళన చెంది, దేశ పునరుద్ధరణకు అవసరమైన ప్రణాళికను రూపొందించుట జరిగినది — అందులో ముఖ్యముగా దేశప్రజ లందరినీ అక్షరాస్యులను గావించుట - బానిస ప్రవృత్తిని పారద్రోలే విధంగా నూతన జాతీయ విద్యాబోధన, అంటరానితనం పోగొట్టుట, సర్వమానవ సమానత్వంపై అనేక ప్రదేశములలో గంభీరోపన్యాసములు చేయుచూ ముఖ్యంగా యువతకు దేశభక్తి, ఆత్మవిశ్వాసం, రగుల్కొల్పిన మహనీయుడు. భయమును విడనాడండి - బలమును పెంచుకొనండి - వ్యాయామంలో పరమార్థానికి సన్నిహితులౌతారని ప్రబోధించి యువశక్తిని ఉత్తేజ పర్చిన మహాత్ముడు. కార్యకర్తలకు యిచ్చిన సూచనలు, హెచ్చరికలు ఆయన ముందు చూపుకు నిదర్శనములు. శతాబ్ది క్రితమే భవిష్యత్తులో సమాజములో ఏర్పడే రుగ్మతలు, దేశనాయకులలోని అవినీతి, అసూయ మొదలగు లక్షణాలు గుర్తించి వారికి సూచనలు యివ్వటం జరిగినది. శీలవంతులైన నాయకులకు విధేయులైన కార్యకర్తలు చేకూరుతారు. విభిన్న భావాలు గల ప్రజానీకమును ఏకత్రాటిపై నడిపించుట నాయకుని శక్తియుక్తులపై ఆధారపడివుంటుందని బోధించిన మహనీయుడు. వివిధ అంశములపై వివేకానందుని భావపరంపర, ఆయన జీవిత సంఘటనలు, ఉత్తేజపూరిత బోధనలు, స్వామిజీ ప్రేరణ అందరకూ అంది నరనారాయణ సేవలో పునీతులు కాగలరనే దృఢవిశ్వాసంతో యీ ప్రచురణకు పూనుకొనుట జరిగినది. బృహత్తరమైన యీ భావప్రచార ప్రయత్నంలో సహకరించిన శ్రీ మన్నవ గిరిధరరావు గారికి, పూజ్యస్వామి జ్ఞానదానందస్వామిజీ మహరాజ్ వారికి, మద్రాసు శ్రీరామకృష్ణ మఠం వారికి మరియు యథాశక్తి సహకరించిన తదితరులందరికీ మా కృతజ్ఞతాభివందనములు.

రామకృష్ణ శారదా కుటీర్
కొత్తగూడెం - 507 101

జాయింటు కన్వీనర్
రామకృష్ణ వివేకానంద భావప్రచార పరిషత్
(ఆం.ప్ర.)

# భారత జాతికి ఆశాజ్యోతి

తాను కలుసుకోవలసిన ముఖ్యవ్యక్తి యొక్క నివాసము, తాను వెళ్లవలసిన స్థలము యొక్క చిరునామా - వీటిని ప్రయాణములో పోగొట్టుకొని ఒక మహానగరములో దారి తెన్ను తెలియక తిరుగాడు వ్యక్తి యొక్క మనోవ్యథ వర్ణించనెవరితరము? అతని క్షోభ ఎంతటి బాధాకరమైనది?

అట్టి దిక్కుతోచని పరిస్థితి నెదుర్కొనుట ఎంత విషాదకరము? దేశముకాని దేశములో తనకు తెలిసినవారు ఒక్కరైన లేని చోట చిరునామా పోగొట్టుకొని తలబాదుకొనుట ఎంత విచారకరము?

ఇట్టి దురదృష్టకరమైన అనుభవాన్ని పొందినవాడు ముప్పదేండ్ల యువక సన్యాసి వివేకానందుడు.

ఆతడు చికాగో మహానగరంలో 1893 సెప్టెంబరు 11నాటి ఉదయం 10గంటలకు ప్రారంభమయే సర్వమతమహాసభలో సనాతన ధర్మ ప్రతినిధిగా పాల్గొనవలసియున్నది. ఆ క్రిందటి రాత్రి బోస్టను నుండి రైలులో చికాగో వచ్చాడు. ప్రయాణంలో చిరునామాలు పోగొట్టుకున్నాడు. ఎక్కడికి వెళ్లాలో తెలియదు. ఆనాటి రాత్రి పరుండుటకు తావు దొరకక రైలుబండి సరకులపెట్టెలో నడుము వాల్చాడు.

తెల్లవారిలేచి నడక సాగించాడు. కడుపులో ఆకలి దహించుకుపోతున్నది. అత్యంత ధనవంతులు నివసించు వీధులగుండా పాదచారియై పోవుచున్నాడు. సౌధముల ఎదుటనిలబడి ఆహారమడిగినా,

సర్వమత మహాసభ చిరునామా అడిగినా చెప్పక పోగా అంతా చీదరించుకుంటున్నారు. అతనికేమీ పాలుపోక నేలపై కూలబడ్డాడు.

తోడనే ఎదురుగా నున్న ఒక భవంతినుండి కరుణాస్వరూపిణి యగు నొక వనితామణి తలుపుతెరుచుకొని స్వామిని సమీపించి "మహాశయా! మీరు మత మహాసభ కొరకు వచ్చిన ప్రతినిధులా?" అని ప్రశ్నించి అయనను తన యింటనుండ నాహ్వానించినది. ఆమె పేరు మిసెస్ జార్జిహేల్. ఆమె సేవకులు స్వామికి కావలసిన వసతులు సమకూర్చారు. భోజనానంతరము ఆమె స్వయముగా సర్వమత మహాసభకు తోడ్కొనిపోయినది. ఎంత చిత్రము! భగవంతుడే ఆమెలో ప్రవేశించి తన్నట్లు ఆదుకున్నాడని వివేకానందుడు భావించాడు.

"గొప్ప కార్యము లెప్పుడును గొప్ప త్యాగముల వలననే సాధించబడుతాయి."

ఆత్మవిశ్వాస పూరితులగు కొందరు వ్యక్తుల చరిత్రయే ప్రపంచ చరిత్ర.

ఏపనీ అల్పంగాదు. ఇష్టమైన పని లభిస్తే పరమ మూర్ఖుడు గూడా చేయగలడు. అన్ని పనులనూ తనకిష్టమైనవిగా చేసుకోగల వాడే నిజంగా తెలివైనవాడు.

ఏదయితే స్వార్థ పూరితమో అది అవినీతి; ఏదయితే స్వార్థ రహితమో అదినీతి.

పశుత్వమునుండి మానవత్వమునకును, మానవత్వము నుండి దైవత్వమునకు గొనిపోవునదే మతము.

బలమే జీవనము, బలహీనతే మరణము"।

ఇట్టి అమృతవాక్కులను లోకమున కందించిన మహనీయుడు వివేకానందుడు. శ్రీరామకృష్ణ పరమహంస ప్రధాన శిష్యుడైన ఆ మహామనీషి దేశదేశాలలో విశ్వజనీనమైన సనాతన ధర్మాన్ని, హైందవజాతి సందేశాన్ని చాటి చెప్పిన ప్రజ్ఞానిధి.

ఆంగ్లేయ పరిపాలనాకాలంలో నైతికంగా పతనమై ఆత్మవిశ్వాసాన్ని కోల్పోయిన హిందూ సమాజానికి వెలుగుబాటలు చూపి జాతి పునరుజ్జీవనానికి పూనుకున్న మహాదేశభక్తుడాతడు. భారత దేశ ప్రాణశక్తి మతములోనున్నదని, హైందవజాతి పునరుద్ధరణ మతం ఆధారంగానే సానుకూలమవుతుందని హెచ్చరించి భారత జాతి పునర్వికాసానికి పునాదివేసిన యోగిపుంగవుడు, సంస్కర్త, సంఘటనాదక్షుడు ఆయనే.

"వివేకానందుని రచనలను నేను క్షుణ్ణంగా అధ్యయనం చేశాను. ఆయన రచనలను మననం చేసుకున్న ఫలితంగా నాదేశం మీద నాకుగల ప్రేమ వేయి రెట్లు పెరిగింది" అని గాంధీమహాత్ముడన్నాడు.

ఐక్యరాజ్యసమితి కార్యదర్శిగా పనిచేసిన యుధాంట్ ఇలా అన్నారు; "వివేకానందుడు ఈ 20వ శతాబ్దపు పరిస్థితులకు అనుగుణంగా ఆలోచనాశక్తిని, ఆధ్యాత్మిక శక్తిని సమన్వయపరచాడు. ఈ సంయోగం వల్లనే మనం ఇప్పటి సమస్యల నెదుర్కొన గలుగుచున్నాము."

"భారతదేశం గురించి తెలుసుకోవాలంటే వివేకానందుని అధ్యయనం చెయ్యండి" అని విశ్వకవి రవీంద్రనాథ్ టాగూర్ అన్నారు.

ఒక్క మాటలో వర్ణించవలెనంటే వివేకానందుడు భారత జాతికి ఆశాజ్యోతి!

# 2. అసాధారణ వ్యక్తిత్వం

వివేకానందుని గుణసంపదను వర్ణించాలంటే మాటలు చాలవు. శంకరాచార్యుని మేధాసంపద, గౌతమ బుద్ధుని త్యాగము, ఛత్రపతి శివాజీ శౌర్యగుణము వీటిని కలబోస్తే వివేకానందుడవుతాడని పలువురు అభిప్రాయ పడ్డారు. శారీరక బలము, మానసిక ఔన్నత్యము, హృదయ నైర్మల్యము। ఇవి ఒక దాన్ని మించి మరొకటి ఆయనలో చోటుచేసుకున్నాయి.

1863 జనవరి 12న కలకత్తాలోని సిమ్లా అను పేటలో విశ్వనాథ్ దత్తా, భువనేశ్వరీదేవి లకు కలిగిన ముద్దుబిడ్డ నరేంద్రుడు. ఇతని సోదరుడగు భూపేంద్రనాధ్ దత్తా ఆంగ్ల ప్రభుత్వానికి వ్యతిరేకంగా ఆరోజుల్లో జరిగిన విప్లవ కార్యకలాపాలలో చురుకుగా పాల్గొనేవాడు. బాల్యము నుండియే నరేంద్రుడు ధ్యానంలో నిమగ్నుడయేవాడు. అతడు ఏకసంధాగ్రాహి. అతని మానసిక ఏకాగ్రత ఆశ్చర్యకరము. తల్లివినిపించెడి భారత, రామాయణ గాథలను మిక్కిలి మక్కువతో వినుచుండెడివాడు. అద్భుతమగు నతని ధారణాశక్తి విద్యాభ్యాసమున కెంతయో ఉపకరించినది.

దక్షిణేశ్వరము నందలి కాళికాదేవి ఆలయములో పూజారిగానున్న శ్రీరామకృష్ణ పరమహంసతో కలిగిన పరిచయము నరేంద్రుని జీవితములో బృహత్తరమైన మార్పు తెచ్చినది. నరేంద్రుని గానమాధుర్యమునకు శ్రీరామకృష్ణుడు ఆనంద పారవశ్యము చెందెడివాడు.

1884లో తండ్రి హృద్రోగముతో మరణించాడు. బి.ఏ. పరీక్ష

వ్రాసిన నరేంద్రునిపై కుటుంబభారము పడినది. అతనికి కష్టదినములు సంప్రాప్తమైనవి. రామకృష్ణుని సూచన మేరకు నరేంద్రుడు కాళీమాత కడకేగి తన దారిద్ర్యమును బాపుమని కోరదలచాడు. కాని తుదకు "తల్లీ! విశుద్ధ భక్తి జ్ఞానములు తప్ప మరొకటి నాకు వద్దు. వాటినే అనుగ్రహింపవలసిన" దని ప్రార్థించి బయటికి వచ్చాడు.

1886లో రామకృష్ణుడు నిర్యాణము చెందుటకు నాలుగు దినముల పూర్వము నరేంద్రుని పిలిచి తన ఎదుట కూర్చుండబెట్టుకొని ధ్యాననిమగ్నుడైనాడు. అపుడేదియో యొక విద్యుత్ ప్రసారము వంటి సూక్ష్మశక్తి తరంగము తనలో ప్రవేశించుచున్నట్లు నరేంద్రునికి తోచినది. అతడు బాహ్యస్మృతిని కోల్పోయినాడు. స్మృతి వచ్చిన పిదప గురుదేవుడతనితో "నరేన్! నేడు నాసర్వస్వము నీకు ధారపోసినాను. ఆధ్యాత్మిక సంపదను కోల్పోయి ఫకీరునైనాను. నేనొసంగిన శక్తిచే లోకమున నీవు ఘనకార్యముల నొనర్పగలవు" అని ఆశీర్వదించాడు.

1892లో నరేంద్రుడు పరివ్రాజకుడుగా యావద్భారతము పర్యటించి సమాజ పరిస్థితులను అవగాహన చేసుకున్నాడు. కాశి, హరిద్వార్, హృషీకేశ్, బదరికాశ్రమం, శ్రీనగర్, మీరట్, ఆళ్వార్, జయపూర్, ఖేత్రి, పూనా, కొల్హాపూర్, మైసూర్, హైద్రాబాద్, రామేశ్వరము, కన్యాకుమారి, మదరాసు మున్నగు నగరములను సందర్శించాడు. అమెరికా ఖండమునకు వెళ్లుటకు పూర్వము ఖేత్రి మహారాజు అభ్యర్థన మేరకు 'వివేకానంద' నామము స్వీకరించినాడు. చికాగోనగరములో జరుగనున్న అఖిల ప్రపంచ మత మహాసభలో సనాతన ధర్మ ప్రతినిధిగా పాల్గొనుటకై బొంబాయి నుండి 1893 మే 31 న 'పెనిన్సులర్' అను ఓడలో బయలుదేరి వెళ్లినాడు.

# 3. హైందవ ఝంఝామారుతము

1893 సెప్టెంబరు 11న సర్వమత మహాసభ ప్రారంభమైనది. ఏడెనిమిది వేలమంది మేధావులతో సభ క్రిక్కిరిసి యున్నది. రోమన్ కాథలిక్ చర్చి అధిపతి కార్డినల్ గిబ్బన్స్ సభాధ్యక్షులుగానున్నారు. బౌద్ధ, జైన, బ్రహ్మసమాజ, ఇస్లాం, జొరాష్ట్రియన్, యూదు, థియోసఫీ మున్నగు మతముల ప్రతినిధులతో బాటు సనాతన ధర్మ ప్రతినిధిగా స్వామి వివేకానందుడు వేదికనలంకరించినాడు. అనిబిసెంట్ వనితామణి దివ్యజ్ఞాన సమాజానికి, మజుందార్ బ్రహ్మసమాజానికి, సింహళము నుండి ధర్మపాల్ బౌద్ధ మతానికీ ప్రాతినిధ్యము వహించారు.

తన పేరు పిలిచినపుడు వివేకానందుడు సరస్వతీ దేవిని మనమున స్మరించుకొని "అమెరికా సోదర సోదరీమణులారా! అని సంబోధించినాడు. రెండు నిముషములు సభలో హర్షధ్వానములు చెలరేగినవి. అన్ని మతములు ఒకే లక్ష్యమును చేరుచున్నవని చెప్పుచూ "వివిధ ప్రదేశములలో పుట్టిన నదులు వేరు వేరు మార్గములలో ప్రవహించినను తుదకు సముద్రములో చేరునట్లే, వివిధ భావములతో మనుజు లనుసరించు వివిధ ఆరాధనామార్గములు వక్రములుగా కనిపించినను, సర్వేశ్వరా! నిన్నే చేరుచున్నవి." అని స్వామి యొసంగిన చిరు ఉపన్యాసము సభాసదులను సమ్మోహితుల నొనర్చినవి. సెప్టెంబరు 27వరకు జరిగిన సర్వమత మహాసభలలో వివేకానందుడు అనేక అంశములపై ప్రసంగించాడు. వీరి ఉపన్యాసము కొరకు శ్రోతలు కనిపెట్టుకొని యుండెడివారు.

స్వామి వర్ణనలతో దిన పత్రికలు నిండిపోయినవి. చికాగోనగర వీధులలో వివేకానందుని నిలువు పటములకు గిరాకీ ఏర్పడినది. "మత మహాసభను అత్యద్భుతముగా స్వవశము గావించుకొనిన మహావక్త వివేకానందు"డని సభాధ్యక్షుడే వచించినాడు. "ఈ మహానీయుని ఎదుట మన విశ్వ విద్యాలయ పండితోత్తములు కేవలము పసిబాలురు!" అని అచటి మేధావులు వ్యాఖ్యానించారు.

వివేకానందుని "ఈశ్వర ప్రేరిత మహావక్త" అనీ అతడు "మిరుమిట్లు గొలిపే ఉపన్యాసకుడు " **Lightning Orator** అనీ, అతని వాగ్ధాటి "హైంధవ ఝంఝామారుతము" **(The Hindu Cyclone)** అనీ పత్రికలు శ్లాఘించినవి, పిదప చికాగో బోస్టన్, వాషింగ్టన్, న్యూయార్క్, బాల్టిమోర్, సెయింట్ లూయీ మున్నగు నగరములలో పుంఖాను పుంఖాలుగా ప్రసంగాలు చేశాడు. క్రైస్తవ మతాచార్యులాతనిని తమ చర్చిలలో ఉపన్యాసము లిచ్చుటకు ఆహ్వానించారు. చికాగో నగరమందలి కోటీశ్వరులు దివ్య భవనములు స్వామి కాతిథ్యమొసగుటకు పోటీపడినవి! పాశ్చాత్య ప్రముఖులనేకులు వారి శిష్యులైనారు. జన సామాన్యంలో వేలకొలది అనుయాయు లేర్పడినారు. అర్హులగు వారి కాతడు సన్యాస దీక్షనిచ్చెడివాడు.

"నరేంద్రుడు ప్రపంచపు పునాదులను కదిలించి వేయును" అని శ్రీరామకృష్ణుడన్న మాట సత్యమైనది.

స్వామి ఐరోపా మీదుగా భారతదేశానికి వస్తూ మార్గమధ్యమున లండన్, పారిస్ నగరాలలో వేదాంతోపన్యాసము లిచ్చారు. మిస్ మార్గరేట్ నోబుల్ (సోదరి నివేదిత) లండన్ నగరములోనే స్వామి శిష్యురాలైనది. లండన్‌లో స్వామి మాక్సుముల్లర్ పండితుని ఆతిథ్యము స్వీకరించారు.

# 4. స్వదేశాగమనము

ఆధునిక భారతదేశ చరిత్రలో వివేకానందుని స్వదేశాగమనము ఒక మహాసంఘటనము. ఐదు సంవత్సరముల పాటు విదేశాలలో హిందూ వేదాంతోపన్యాసముల నొసంగి 1897 జనవరి 15న సింహళము నందలి కొలంబో నగరములో ఆ మహనీయుడడుగు మోపాడు. మార్గమంతటా జనులు పూలవర్షం కురిపించారు. "పావన భారత వర్షము' ' గురించి కొలంబోలో స్వామి ప్రసంగించారు. పిదప కాండీ, జాఫ్నా నగరములలో మహాస్వాగతములనొంది తన దివ్య సందేశములనొసంగి రామేశ్వర సమీపములోని పాంబన్ రేవులో అడుగు పెట్టాడు.

అచట రామనాథపురం మహారాజగు భాస్కర సేతుపతి సాష్టాంగ వందనమొనర్చి, స్వామిని రాజతురంగ శకటముపై ఆసీను నొనర్చి, గుఱ్ఱములను విప్పి తన సహచరులతో పాటు తానే శకటమును స్వహస్తములతో పురవీధులగుండా లాగి తన ఆనందమును వ్యక్తీకరించాడు. వివేకా నందుని మాతృ దేశాగమన చిహ్నంగా రాజు 40 అడుగుల ఎత్తగు విజయస్తూపాన్ని నిర్మించాడు. స్వామి మధుర, తిరుచునాపల్లి, కుంభకోణంలలో అఖండ గౌరవము పొంది రైలులో మద్రాసు వస్తూ వుండగా ఒక విచిత్ర సంఘటన జరిగింది.

ఒక చిన్న స్టేషనులో వేలకొలది జనులు జగద్గురువగు వివేకానందుని దర్శించుటకై వేచియున్నారు. కాని బండి అచట ఆగదు. కొలది నిముషములు బండి నాపింపుమని స్టేషను మాష్టరును

వేడుకున్నారు.

కాని అతడంగీకరించలేదు. స్వామి పైగల గాఢాభిమానముతో జనులు బండికొద్ది దూరములో నుండగనే రైలు పట్టాల కడ్డముగ పరున్నారు. వారి పట్టుదల చూచి స్టేషను మాస్టరు హడలిపోయినాడు. ఏమి చేయుటకును దిక్కుతోచలేదు. రైలు నడిపెడి డ్రైవరు బుద్ధిమంతుడగుటచే పరిస్థితి గ్రహించి రైలు ఆపాడు. స్వామి కొలది నిముషములు ప్రజల ఎదుటనిలిచి వారల నభినందించి ప్రేమతో వారినుండి వీడ్కోలు తీసుకొన్నాడు.

మద్రాసు నగరములో జనుల మహోత్సాహము వర్ణింపనలవి కానిది. నగరమంతయు స్వాగతి వాక్యములచే విలసితములగు తోరణములలో అలంకరించారు. "యుద్ధరంగములో అఖండ విజయము సాధించి వచ్చిన సైన్యాధిపతిని స్వీకరించునట్లు మదరాసు ప్రజలు ఆనాడు వివేకానందునికి స్వాగతము పలికారు" అని పత్రికలు వ్రాసినవి. అంతకు పూర్వము ఏ భారతీయ లేదా ఆంగ్లేయ ప్రముఖునికి మదరాసులో లభించనంతటి గౌరవము వివేకానందునికి లభించినది. తమిళనాడు ప్రజలు స్వామిని "పరమ శివుని అవతారము" గా విశ్వసించి తమ అభిమానమును ప్రకటించారు.

వివేకానందుడు కలకత్తా వెళ్లి అచట 1898లో 'శ్రీరామ కృష్ణమిషన్' అను సేవా సంస్థను స్థాపించినాడు. జనులకు ఐహిక ఆముష్మిక శ్రేయస్సుల నొసగు విద్యలను బోధించుటకై విద్యాలయాలను స్థాపించుట, వైద్య సహాయమొనర్చుట, దరిద్రనారాయణ సేవలు నిర్వహించుట, శ్రీరామకృష్ణుడు వెలువరించిన వేదాంతాభిప్రాయాలను సామాన్య జనుల కందించుట ఈ సంస్థ యొక్క లక్ష్యములు.

కొలంబోలో ప్రారంభమైన వివేకానందుని సింహగర్జనలు దేశమంతటా మార్మోగినవి. మదరాసు, కలకత్తా, లక్నో, లాహోరు, జమ్మూ, అల్వార్, ఖేత్రి మున్నగు నగరాలలో బ్రహ్మాండమైన సభలలో ప్రసంగించి తుదకు స్వామి హిమాలయములలోని ఆల్మోరా నగరాన్ని సందర్శించారు. భారతజాతి సర్వతోముఖ వికాసమునకు వలయు భావ పరంపరను స్వామి వారు తమ ప్రసంగములలో వెల్లడించారు. ఆ దివ్య ప్రసంగము లన్నియు **"Lectures from Colombo to Almora"** అని ఆంగ్లములోను, "సందేశ తరంగిణి" అని తెలుగు లోను పుస్తకములుగా వెలువడినవి. దేశభక్తులకు, సనాతన ధర్మ ప్రచారకులకు, సమాజ సేవకులకు ఆ గ్రంథము మిగుల స్ఫూర్తి దాయకమైనది.

## 5. నరుడే నారాయణుడు

వివేకానందుని ప్రత్యేకత ఏమనగా, ఆయన సన్యాసుల ఎదుట, దైవభక్తుల ఎదుట ఒక క్రొత్త ఆదర్శాన్ని నెలకొల్పారు.

అరణ్యాలకో, కొండగుహలకో వెళ్లి కళ్లు మూసుకొని ఆత్మజ్ఞానం పొందడానికి ప్రయత్నించడం పూర్వ సాంప్రదాయం. అలా కాక, ఈ కంటికి కనిపించే జీవులనే శివునిగా భావించి వారికి సేవచేయడమే దైవపూజగా తలంచి జీవిత లక్ష్యమును సాధించడమే వివేకానందుడు ప్రకటించిన క్రొత్త ఆదర్శం.

"ఈశ్వర స్సర్వభూతానాం హృద్దేశేఽర్జున తిష్ఠతి" । అర్జునా! ఈశ్వరుడు సర్వభూతముల హృదయములందు వాసము చేయుచున్నాడు అని గీతలో భగవానుడు చేసిన ప్రవచనమే వివేకానందుని

అకట్టుకున్నవి. దానిని ఆచరణలోనికి తీసుకురావలెనని ఆయన ప్రబోధించాడు.

"నిజమైన ఈశ్వరార్చనము" గురించి రామేశ్వరములో ఉపన్యసిస్తూ వారిలా అన్నారు:

మతమనునది ప్రేమలోను భక్తిలోను ఉంటుందిగాని బాహ్యమైన అర్చనలలో కాదు.

నరుడు శరీరమునందును మనస్సు నందును పరిశుద్ధుడైతేగాని దేవాలయానికి వచ్చుటవలన, దేవుని పూజించుట వలన ఫలితము కలుగదు.

ఈ కలియుగమున జనులు తాము ఏమిచేసినా సరే, ఒక పుణ్యక్షేత్రమునకు పోయినంత మాత్రమున తమ పాపములన్నియు కడికి వేయబడునని అనుకొనేటంత అధోగతిలో వున్నారు. అట్టి వారు చేరినచో తీర్థక్షేత్రము నందలి పవిత్రత గూడ అదృశ్యము కాగలదు.

నిష్పాపులుగ నుండి పరోపకారము చేయుటయే పూజ లన్నిటి యొక్క సారము.

దరిద్రునందును, దీనునియందును, రోగియందును శివుని చూడగలుగువాడే నిజమైన శివారాధకుడు. విగ్రహము నందు మాత్రమే శివుని చూడగలుగు వాని పూజ ప్రారంభదశలోనిదే. ఒక దరిద్రుని యందు| వాని జాతిగాని. మతమును గాని, కులమును గాని మరిదేనిని గాని పాటింపక - శివుని జూచి, వానికి సాయపడి ఉపచారములు చేసిన వానిపై శివుని కెక్కువ ప్రీతి. తనను దేవాలయములందు మాత్రమే చూడగలుగునట్టి మానవునిపై దేవునికంత ప్రీతి ఉండదు."

ఇందుకు తార్కాణముగ స్వామి ఒక చక్కని ఉదాహరణను చెప్పినారు. "ఒక్క ధనికునకు ఇద్దరు తోటమాలీలున్నారు. వారిలో ఒకడు 'పరమ సోమరి; పనిచేసేవాడుకాదు. కాని యజమాని తోటలోనికి వచ్చినప్పుడల్లా లేచి చేతులు జోడించుకొని "ఆహా! మా దొరగారి ముఖము ఎంత సుందరముగా నున్నది!" అని పొగడుతూ వాని ఎదుట తన్మయత్వము నటించెడివాడు. రెండవతోట మాలి అతిగా మాట్లాడడు. కష్టపడి పనిచేసి అన్ని రకముల పండ్లను, కూర గాయలను పండించెడివాడు. వాటిని నెత్తినపట్టుకొని మోసుకుపోయి దూరముగానున్న యజమాని యింటికి చేర్చెడివాడు.

ఈ ఇరువురు తోటమాలీలలో ఎవరిని యజమాని ఎక్కువగ మెచ్చుకొనునో ఆలోచించండి. శివుడే అట్టి యజమాని; ఈ ప్రపంచమే అతని తోట. ఇక్కడ రెండు రకముల తోటమాలీలున్నారు. ఒకడు సోమరి, మాయలమారి, మోసగాడు. ఏమియు పనిచేయడు. కాని శివుని కన్నుల సొగసును, ముక్కు యొక్క చక్కదనమును, రూపసౌందర్యమును ఊరక వర్ణిస్తూ స్తోత్రములు చేస్తూ వుంటాడు. రెండవవాడు శివుని సంతానమగు దరిద్రులను, దీనులను, సమస్త జంతుజాలమును, అది ఇది అననేల - సమస్త సృష్టిని కనిపెట్టుచూ సేవిస్తూ వుంటాడు. వీరిరువురిలో శివునకు ఎక్కువ ప్రియుడెవరు?

ఈ విధంగా వివేకానందుడు దైవమును ఆరాధించుటలో, మతమును ఆచరించుటలో ఒక నూతన విధానాన్ని ప్రారంభించాడు. ఇదే ఆయన యొక్క ప్రత్యేకత.

# 6. దేశభక్తి, ఆత్మవిశ్వాసములను రగుల్కొల్పిన మహనీయుడు

1857లో జరిగిన స్వాతంత్ర్య సమరంలో పరాజయం పొందిన కారణంగా భారతీయులలో ఆత్మవిశ్వాసం క్షీణించింది. ప్రపంచంలో మనం ఎందుకూ కొరగాని వాళ్లమనే భావం ఏర్పడింది. మనలను జయించిన ఆంగ్లేయులు మానవోత్తములనే ఆలోచన కలిగింది.

దేశీయ భాషలమీద ద్వేషం, ఆంగ్లభాషపై ప్రీతి; భారతీయ ఆచారాలపై అసహ్యం, ఆంగ్లేయ అలవాట్లపై ఆసక్తి; హిందూ ధర్మంపై విరక్తి, ఆంగ్లేయుల మత విశ్వాసాలపై అనురక్తి; తోటి భారతీయులపై ఏహ్యాభావం, తెల్లవారిపై గౌరవభావం - ఇలా భారతీయుల మనస్సులు న్యూనతాభావంతో క్రుంగిపోయాయి. మనం అల్పులమనీ, పాశ్చాత్యులు అధికులనీ భావించడం జరిగింది. ఈదేశంలోని గొప్ప కుటుంబాల వాళ్లు తమ బిడ్డలను మూడవయే టనే ఇంగ్లాండుకు పంపి అచటనే చదివించేవారు. తమ బిడ్డలకు ఈదేశపు గాలికూడ సోకడం వారికిష్టం లేకుండెను.

ఇలా దేశ ప్రజల మనస్సులు అవిశ్వాసంతో నిండి యున్న తరుణంలో దేశభక్తినీ ఆత్మవిశ్వాసాన్నీ రంగరించి పోసిన ఘనవై ద్యుడు వివేకానందుడు. చికాగోమత మహాసభలోను, పాశ్చాత్యదే శాలలోను ఆయన సాధించిన ఘన విజయాలు భారతీయులను సంభ్రమాశ్చర్యాలతో ముంచెత్తాయి. భారతదేశానికి తిరిగి వచ్చిన

పిదవ ఆయన తన సోదర ప్రజలనిలా ఉద్బోధించారు.

"ఈ భూమండలంలో పుణ్యభూమి అనిపించుకోగలదేశం; కర్మానుభవానికై ప్రపంచంలో ఎక్కడెక్కడి నుంచో జీవులు వచ్చి అవతరించేదేశం, మోక్షమార్గంలో జీవయాత్ర గడిపే ప్రతి జీవీ చిట్టచివరి మజిలీగా చేరుకోవలసిన దేశం; సౌజన్యంలో ఔదార్యంలో పవిత్రతలో ప్రశాంతతో అన్నిటికీ మించి ఆత్మావలోకనంలోనూ ఆధ్యాత్మికత లోనూ మానవజాతి పరాకాష్ఠ నందుకున్న దేశం ఏదైనా ఒకటివుంటే అది భారతదేశమే!

ఇక్కడనే, ఈ ఒక్క దేశంలోనే మానవహృదయం అతి విశాలమైన అనంత విస్తృతి నంది తోటి మానవ జాతియే గాక పశుపక్ష్యాదులతో సహాసమస్త ప్రాణికోటీ, చేతనాచేతన సర్వజగత్తూ, ఉచ్ఛనీచంలేకుండా తన లోనే వున్నట్లు భావన చేయగలిగింది. విశ్వాన్నంతటిని ఆత్మమయంగా భావించి, ఆ ఆత్మస్వరూపమే తాను అన్న వివేకాన్ని గూడా మానవుడిక్కడే పొందాడు.

మనం భారతీయులుగా జన్మించినందులకు గర్వించాలనీ, హిందూ భావన మనలో సమైక్యతను కలిగించాలనీ చెపుతూ ఇలా అన్నారు:

"హిందూ వన్న మాట వినడంతోనే నీలో ఎక్కడలేని శక్తి ఆవిర్భవించి నిన్ను సర్వసమర్థుణ్ణి చేయాలి. అపుడే నీవు నిజమైన హిందువు కాగలవు.

విదేశానికి చెందిన భారతీయుడైనా ఏభాష మాట్లాడే వాడైనా నీకి బహిఃప్రాణం కావాలి. అపుడే నీవు నిజమైన హిందువు.

ఏ భారతీయుని కష్టస్థితి అయినా నీ హృదయాన్ని కరిగించి,

నీ కన్నకొడుకే కష్టంలో వున్నట్లు నీ చేత భావింపజేయాలి. అప్పుడే నీవు నిజమైన హిందువు."

మనదేశ ప్రజలలో ఆత్మవిశ్వాసాన్ని పెంపొందించిన వలసిన ఆవశ్యకతను వారిలా నొక్కి చెప్పారు:

"ఐరోపా అమెరికాల్లోని జనుల హృదయాలలో ఆత్మవిశ్వాస మనే మహత్తరశక్తి స్పష్టంగా కనిపిస్తూ ఉంటుంది."

ఆంగ్లేయ బాలుణ్ణి ఎవరిని కదిలించినా, "నేను ఇంగ్లీషువాణ్ణి. నేను ఏమైనా చెయ్యగలను" అని ధైర్యంగా చెపుతాడు. అమెరికన్ బాలుడూ అలాగే అంటాడు. మన దేశంలో పిల్లలు అలాచెప్పగ లరా? వాళ్లు చెప్పలేరు సరిగదా ఆ పిల్లల తల్లిదండ్రులు గూడ చెప్పలేరు. మనం ఆత్మవిశ్వాసాన్ని కోల్పోయాం.

భగవంతుడు మనలోనే ఉన్నాడనీ, అంతటా అంతర్యామియై ఉన్నాడనీ చెప్పని మత సంస్థ భారత దేశంలోలేదు. వేదాంత తత్త్వవేత్త లందరూ ఆత్మ సర్వజ్ఞమనీ, పరిపూర్ణమనీ, సమస్తశ క్తులూ అందులోనే వున్నాయనీ అంగీకరిస్తారు. అయినా ఎందుచే తనో మనం ఆత్మవిశ్వాసాన్ని కోల్పోవడం తటస్థించింది.

అందుచేత మన యందు మనం విశ్వాసాన్ని పెంపొందించు కొనే ఆదర్శం మన కిప్పుడెంతో సహాయం చేస్తుంది. ఆత్మవిశ్వాసం అత్యుత్తమ ఆదర్శమని అందరికీ బోధించి దాన్నే ప్రజలచేత అభ్యసింప చేసినట్లయితే మనకున్న అర్థాలూ కష్టాలు ముప్పాతిక మూడు వంతులు అదృశ్యమై పోయేవి.

ఈ మన భారతదేశానికి ఒకానొక ఆంగ్లేయుడు మామూలు గుమాస్తాగా వచ్చాడు. డబ్బు చాలకా, ఇతర కారణాలచేతా ఒకటి

రెండు మార్లు ఆత్మహత్యా ప్రయత్నానికుద్యుక్తుడైనాడు. వైఫల్యం పొందడంతో అతనిలో అతనికి విశ్వాసం కలిగింది. మనం గొప్పవాళ్ళ మయ్యేటందుకే జన్మించామని గట్టిగా నమ్మాడు. ఆ మనిషే సామ్రాజ్య నిర్మాత అయిన రాబర్ట్క్లైవు!

అందుచేత నిన్ను నీవు నమ్ముకో. నీకు భౌతిక ఐశ్వర్యం కావాలా? దానికై కృషిచెయ్యి, అది నీకు లభిస్తుంది. ధీమంతుడవు కాదలిస్తే ఆ మార్గంలో కృషిచెయ్యి, త్వరలోనే ఇక్కడే ఈ జనంలోనే బంధవిముక్తుడనై జీవన్ముక్తుడవవుతావు"

## 7. ఎద్దు కథ; కోతుల కథ!

మానవుడు చిన్న కష్టానికే బెదిరిపోతాడు. జీవితం కష్టసుఖాల సమ్మేళనమని గ్రహించడు. బాధలు, ప్రమాదాలు రాగానే భీతి చెంది పారిపోతాడు. అలా భయపడకుండా ధైర్యంగా ఎదురొడ్డి నిలబడగలవాడే జీవితంలో రాణిస్తాడు. అందుకై రెండు చక్కని కథలను వివేకానందుడు తన ప్రసంగాలలో పేర్కొన్నాడు.

### మొదటిది ఎద్దు కథ

"గొడ్ల సావిట్లో ఎద్దు మేస్తున్నది. ఈగ ఒకటి వచ్చి దాని కొమ్ము మీద కూర్చున్నది.

ఉదయం నుండి మధ్యాహ్నం వరకు కూర్చున్న ఈగ కూర్చున్నట్లే వున్నది. అప్పుడది అయ్యో! ఈ యెద్దుకు నావల్ల ఎంత బారం కలుగుతున్నదో ననుకొని, "ఎద్దుగారూ! ఉదయంనుంచీ మీ కొమ్ము మీద కూర్చున్నాను. పాపం మీకెంత భారమయ్యానో.

ఏమీ అనుకోవద్దు. నేను వెళ్లిపోతున్నాను లెండి" అని అన్నది.

అపుడా వృషభం ఆ ఈగ వంక చూచి "నీవు నా కొమ్ము మీద కూర్చున్నావా? నాకు తెలియదే. నాకేమీ బరువులేదు. నీసంతానాన్నంతటినీ తెచ్చి కూర్చో. నాకెలాంటి బాధాలేదు" అని జవాబిచ్చింది.

"మనకెదురయ్యే కష్టాలతో ఇలాగే జవాబు చెప్పాలి" అన్నారు స్వామి వివేకానంద.

## రెండవది కోతుల కథ

"ఒకప్పుడు నేను కాశీలో ఉండగా ఒక ఎత్తయిన గోడకూ, ఒక లోతైన తటాకానికీ నడుమనున్న సందులో నడిచి పోతు న్నాను. ఆ ప్రాంతం నిండా కోతులు సమృద్ధిగా ఉన్నాయి. కాశీ కోతులు పరమమూర్ఖంగానూ అప్పుడప్పుడూ క్రూరంగానూ ప్రవర్తిస్తుంటాయి."

నన్నాదారిన పోనివ్వగూడదని వాటికి దుర్బుద్ధి పుట్టి నా వెంటపడి అరచిగోలచేస్తూ కాళ్ల కడ్డంపడసాగాయి. అవి మీదికి రాగానే నేను పరుగెత్తాను. అవి వెంటపడి నన్ను కరవడం మొదలుపెట్టాయి. తప్పించుకోవడం అసాధ్యమనిపించింది.

అంతలో అవతలనుంచి ఎవరో "ఎదురు తిరిగి తరిమి వెయ్యి మూర్ఖుల్ని!" అన్నాడు. నేను వెనక్కి తిరిగి ఎదుర్కొన్నాను. అవి జంకి చివరకు పారిపోయాయి.

ఈ అనుభవం నాజీవితానికంతకూ ఉపదేశమయింది. కష్టాల్ని ఎదుర్కోవాలి. ఆకోతుల్ని ఎదుర్కొన్న విధంగా జీవిత కష్టాలను గూడ ధైర్యంతో ఎదుర్కోవాలి. వాటిని జూచి మనం పారిపో

వడం మానివేస్తే అవే జంకి వెనక్కి పోతాయి."

## 8. గుణసంపదగల వ్యక్తుల నిర్మాణం

మనం సముద్రం మధ్యలో వున్నామనుకోండి. అపుడు 'ఎటు చూచినా నీరే వున్నది; త్రాగడానికి మాత్రం ఒక్క చుక్క గూడా లేదు' అనిపిస్తుంది ఎవరికైనా.

అలాగే భారతదేశంలో ఎక్కడ జూచినా జనం కనిపిస్తారు. కాని పనికివచ్చే వ్యక్తులు - కార్యదక్షత, పట్టుదల, నిజాయితీ, బుద్ధికుశలత కలిగిన కార్యసాధకులు దొరకరు. దేశంలో ఏ మంచి పని సాధించాలనా 'మనుషుల కొరత' విపరీతంగా ఉన్నది.

ఒకసారి అధికారం హస్తగతమైతే అట్టి అధికారం ద్వారా, ప్రభుత్వం ద్వారా దేశాన్ని మార్చివేయవచ్చుననీ, జాతిని ఉద్ధరించ వచ్చుననీ పలువురు భావిస్తారు. కాని అదిజరిగే పనికాదు. ఎందువల్ల నంటే, మనుష్యులతో సంస్కారాలను కలిగించి వారిని శీలవంతులుగా రూపొందించే శక్తి ప్రభుత్వాలకుండదు.

ఈ సత్యాన్ని దృష్టియం దుంచుకొని స్వామి వివేకానందుడు ఇలా ప్రకటించాడు. "అన్ని సామాజిక రాజకీయ వ్యవస్థలు స్థిరముగా నిలబడుటకు మనుష్యుల శీలమే ప్రాతిపదికగా వుంటుంది. పార్లమెంటు సభ్యులు చేసే చట్టాలవలన ఏ జాతీ ఉన్నత దశనందుకోలేదు. ఆ దేశ ప్రజలు గొప్పవారయితేనే ఆ జాతి గొప్ప స్థాయినందుకుంటుంది. ప్రపంచంలోనున్న యావత్తు సంపదకంటె గూడ మనుష్యులు విలువైనవారు. ఒకవేళ మనకు కావలసిన అవసరాలనన్నిటినీ ప్రభుత్వం సమకూర్చిందనుకోండి. వాటిని సద్వ్వని

యోగపరచగల శీలవంతులైన వ్యక్తులేరీ? కనుక అట్టి మనుష్యులను మొదట తయారు చేయండి!"

దేశానికి ఏ సుగుణాలు గల వ్యక్తులు అవసరం? వారిని ఎలా నిర్మాణం చేయాలి? మనలో వున్న అవగుణాలేమిటి? వాటిని ఎలా తొలగించుకోవాలి? కార్యకర్తలను రూపొందించే మార్గాలేమిటి? అనే విషయాల గురించి వివేకానందుడు ఇలా స్పష్టమైన అభిప్రాయాలు వెల్లడించారు:

## జాతి పతనానికి మూలకారణం

"ఒక్క విషయమాలోచించండి. కేవలం నాలుగుకోట్లమంది ఆంగ్లేయులు ఇక్కడ 30 కోట్ల మంది భారతీయులను ఎలా పాదాక్రాంతం చేసుకొని పరిపాలిస్తున్నారు? ఇందలి రహస్యమేమిటి? దీనికి మౌలికమైన కారణమేమిటి?

ఆ నాలుగు కోట్లమందీ తమ తమ ఇచ్ఛాశక్తులను ఏకంచేయడం వలన ఉజ్జ్వలమైన శక్తి కేంద్రంగా రూపొందారు. మనం 30 కోట్ల మందీ ఎవరికి వారుగా వ్యవహరిస్తూ తమ శక్తులకు విడి విడిగా నిలుపుకున్నారు. అందుచేత మనం పతనమైనాం. ఇపుడు మన జాతిని పునరుద్ధరించాలంటే ప్రజలను సంఘటితం చేయాలి. వారి శక్తులను ఏకీకృతం చేయాలి. వారిని ఒక్క మనస్సుతో ఆలోచింపచేయాలి.

'అధర్వ వేద సంహితలో' గల ఒక చక్కని సందేశం గుర్తు చేసుకుందాం. "మీరందరూ ఏక మనస్కులు కండి. ఒకే రీతిలో భావన చేయండి. ఎందుకంటే పూర్వం దేవతలు ఒకే మనస్సుతో మెలగడంవలన జయాలు సాధించి కీర్తి ప్రతిష్ఠలు పొందారు. ప్రజలు దేవతలను అర్చించడానికి కారణం వారు ఒకే మనస్సుతో

మెలగడమే."

ఆదర్శసమాజం యొక్క రహస్యం ఏకమనస్సుతో మెలగడంతో నిక్షిప్తమై వున్నది. ఎంతకాలమైతే మనం ఆర్యులమనీ ద్రావిడులమనీ, బ్రాహ్మణులనీ బ్రాహ్మణేతరులనీ అల్పవిషయాలపై కలహించుకుంటూ వుంటామో, అంతవరకు దేశంలో శక్తి నిర్మాణం జరుగదు. భారతదేశ పునర్వికాసం ఆకాశ పుష్పంగానే ఉండిపోతుంది.

గుర్తుంచుకోండి. భారతదేశ భవిష్యత్తు కేవలం దీనిమీదనే ఆధారపడివున్నది. ప్రజల ఇచ్ఛాశక్తులను సమన్వయపరచడం, కలపడం, ఏకశక్తిగా రూపొందించడం ఇదే దేశభవిష్యత్తుకు రాజమార్గం.

## అనుకరణ అభివృద్ధికి మార్గం కాదు

ఈనాడు పాశ్చాత్య విజ్ఞానాన్ని కాస్త రుచిచూచిన ప్రతి వ్యక్తీ తాను సర్వజ్ఞుడనని విర్రవీగుతున్నాడు. అతని అభిప్రాయంలో హిందూభావన యావత్తూ పనికిరాని చెత్త, వేదాంతమంతా పిల్లలు చేసే రణగొణ ధ్వని, మతం అనేది మూఢవిశ్వాసాల పుట్ట!

అనుకరణ నాగరికత కాజాలదు. రాజు దుస్తులు ధరించినంత మాత్రాన నేను రాజునవుతానా? సింహం తోలు కప్పుకున్న గాడిద సింహం కాజాలదు. అనుకరణ అభివృద్ధికి మార్గంకాదు. అది మనిషి ఘోరంగా పతనం కావడానికి చిహ్నం.

ఎప్పుడైతే మనుష్యుడు తనను తాను అసహ్యించుకుంటాడో, ద్వేషించుకుంటాడో, అదే అతని చరమదశ. ఎప్పుడైతే అతడు తన పూర్వీకులను తలచుకొని సిగ్గు పడతాడో, అదే అతని ఆఖరుదశ. ఈ భారతీయ జీవనం నుండి దూరంగా లాగివేయ

బడకండి. ఒక పరాయి జాతీయులవలె వేషము ధరించి, ఆహారం భుజించి ప్రవర్తించినట్లయితే మంచిదని కలలోనైనా తలచకండి.

మనకు చాలా మూఢ విశ్వాసాలు, మచ్చలు ఉన్నమాట సత్యమే. వాటిని మనం వదిలించుకోవాలి; తొలగించుకోవాలి; కోసి అవతల పారవేయాలి. అయితే ఇవి మన మతమును, జాతీయ జీవనమును, ఆధ్యాత్మికమును నిర్మూలించడంలేదు. మన మతం యొక్క మౌలిక సూత్రములు స్వచ్ఛముగా నున్నాయి. ఈ మచ్చలను తొలగించుకొనిన మరుక్షణంలో మన సిద్ధాంత ములు మరింత కాంతివంతముగా ప్రకాశించగలవు.

## బలమును పెంచుకోండి, భయమును వదలండి!

నానాటికీ నాకు విస్పష్టంగా గోచరిస్తున్న విషయమేమిటంటే - సమస్తము ధైర్యసాహసాలపై ఆధారపడి యున్నది. ఇదే నా నూతన సందేశం.

వలయునది పురుషకారము. పురుషకార విహీనునకు పరమే శ్వరానుగ్రహము లభించుటకల్ల.

శారీరికంగా మనం దుర్బలులము. మన కష్టాల్లో మూడవవం తుకు దైహిక దౌర్బల్యమే హేతువు.

ముందు మన యువకులంతా దృఢశరీరులు కావాలి. తర్వా తనే మతాన్ని గురించి ఆలోచించాలి.

యువకులారా! శక్తిమంతులుకండి. గీతా పఠనంతో కంటె వ్యాయామంతో మీరు పరమార్థానికి సన్నిహితులవుతారు. మీ భుజ బలం పెరిగితే, మీరు మరింత దృఢశరీరులైతే ఉపనిషత్తులను బాగా అర్థం చేసుకోగలుగుతారు.

మనకు కావలిసినది రక్తంలో శక్తి, ఇనుపకండలు, ఉక్కు నరాలు, వజ్రాయుధంతో తుల్యమగు మనస్సు — అంతెగాని నీరసపరచే భావాలు కావు.

ఉపనిషత్తులు మన కందించు ఏకైక సందేశ మేమిటంటే, భయమును విసర్జించుమని మనము జనులకు బోధించవలసిన ఏకైక మతము ఏదనగా — భయరాహిత్యము. దౌర్బల్యమనెడి వ్యాధినుండి విముక్తులు కండు. ఆత్మ అనంతమైనది, సర్వశక్తి వంతమైనది. సర్వ వ్యాపకమైనది. అట్టి ఆత్మయే నేనని నిరంతర మననం చేసుకోండి.

## మత మౌఢ్యాన్ని విడనాడండి

అల్ప విషయాలకు అధిక ప్రాధాన్యమిచ్చి అవే జీవన్మరణ సమస్యలైనట్లు చర్చిస్తూ వాటిని గురించి పెద్దపెద్ద గ్రంధాలు వ్రాస్తూ జీవితాన్ని వ్యర్థం చేసేవారినుండి ఎవరైనా ఏమి ఆశించగలరు?

ఒక బంగాళాదుంప వంకాయకు తగిలితే విశ్వ ప్రళయం ఎన్నాళ్లలో వస్తుంది? చేతులు శుద్ధి చేసుకొనుటకుగాను పండ్రెండు సార్లు మట్టితో తోముకొనని షక్షమున పితరులు నరకమునకు పోవునది పదునాలుగు తరములవారా లేక ఇరువది నాలుగు తరముల వారా? జనాభాలో నాలుగవ వంతుమంది తిండిలేక పస్తులుంటో వుండగా ఇలాంటి ధర్మసూక్ష్మముల గురించి రెండువేల యేండ్లుగా చర్చిస్తున్నారు. ఎనిమిదేండ్ల పిల్లలను ముప్పదేండ్ల వానికిచ్చి పెళ్లి చేసి తల్లిదండ్రులు బ్రహ్మానంద పడుచున్నారు. వాని నెవ్వరైన ప్రతిఘటించిన యెడల "మా మతము ధ్వంసమైపోవుచున్న" దని పెద్దగోల! ఇట్టి వారి మనమునేమనవచ్చును?

మనము కేవలము "నన్ను ముట్టుకోకు, నన్ను ముట్టుకోకు"

అనే సిద్ధాంత వాళ్లము. మన మతము ప్రస్తుతము వంట శాలలో వున్నది. వంట పాత్రే మన దేవుడు. "నన్ను ముట్టుకోకు, నేను పవిత్రుణ్ణి" అన్నదే మన మతం. మరొక శతాబ్దం ఇలాగే గడిస్తే దేశం పిచ్చి వాళ్ల నిలయం కాక తప్పదు.

ప్రాచీనతా మౌఢ్యము పాశ్చాత్యవ్యామోహము ఈ రెండింటినీ తొలగించుకొని ముందుకు సాగాలి.

## 9. కార్యకర్తలకు సూచనలు, హెచ్చరికలు

ఒక మారుస్వామీజీ మిత్రులతో మాట్లాడుతూ "అమెరికాలో నా జీవిత సమ్మోహిని ఉన్నది" అని అన్నారు.

ఇది విన్న ఒక వనిత సరదాగా ఆయనను కొంచెం ఉడికిద్దామని "ఆమె ఎవరు స్వామీ?" అని అడిగింది.

అందుకాయన పకపకానవ్వి "ఆమె ఎవరో స్త్రీ కాదు తల్లీ! ఆదేశంలో ఉన్న సంఘటనా శక్తి organising ability" అన్నారు.

అమెరికా సంయుక్త రాష్ట్రాలలో ఒక సంస్థ నిర్మాణానికి, చేపట్టిన కార్యాన్ని మధ్యలో నిలిపి వేయకుండా పకడ్బందీగా నిర్వహించడానికి ఎంతగా కృషిచేస్తారో ఆయన పరిశీలించారు. భారతదేశంలోగూడ సుసంఘటితమైన సంస్థను నిర్మించాలనీ, దానిద్వారా భారతజాతి పునరుజ్జీవనానికై అనేక సేవాకార్యక్రమాలు చేపట్టాలనీ, కార్యకర్తలకు శిక్షణ నివ్వాలనీ వారు ఆకాంక్షించారు. అందుకు తగిన ఆలోచనలను కార్య పద్ధతిని సూచించారు. వారి భావాలలో

కొన్ని యిలా ఉన్నాయి.

## వ్యవహారం దగ్గర కచ్చితంగా ఉండాలి

భారతదేశంలో సమిష్టి ప్రయత్నాలన్నీ ఒకేఒక దుర్లక్షణం యొక్క బరువుతో క్రుంగిపోతున్నాయి. మనమిప్పటికీ వ్యవహార నియమాలను పాటించడంలో శ్రద్ధ వహించడంలేదు. వ్యవహారం వ్యవహారమే. అక్కడ స్నేహాలూ పరిచయాలు పనిచెయ్యకూడదు. ఎక్కడైనా బావగాని వంగతోట దగ్గర బావకాడన్న సామెత ఆచరణలో ఉండాలి. తనకు వప్పగించబడిన సర్వానికీ తాను కచ్చితంగా లెక్క చెప్పగలగాలి. ఒకందుకు ఉద్దేశంపబడిన ధనాన్ని దానికి తప్ప మరొక దానికి ఎంత మంచిపనికైనా ఉపయోగించకూడదు.

ఒకరున్నా లేకపోయినా దానంతటదే పనిచేసే యంత్రాంగాన్ని ఏర్పాటు చేయాలి. వ్యక్తులతో నిమిత్తంలేని శాశ్వత సంస్థను మనం నిర్మించుకోవాలి.

## స్వలాభంవదలుకోవాలి

ఇపుడు భారతదేశంలో ముగ్గురు మనుషులు ఐదు నిముషాల సేపు కలిసి పనిచేయలేరు. ప్రతివాడూ పదవికొరకు ప్రాకులాడుతాడు. అట్టిస్థితిలో త్వరలోనే సంస్థ అంతరిస్తుంది. ఈ పరిస్థితి మారాలి.

మానవజాతికి మేలు చేయదలచినవారు తమ సుఖదుఃఖాలూ, పేరూ ప్రతిష్ఠలూ, లాభాలూ, ప్రయోజనాలూ అన్నీ కట్ట గట్టి సముద్రంలో పారవేసి నిర్మలచిత్తులై కార్యరంగంలో అడుగు పెట్టాలి.

శిరసావహించడం తెలిసిన వాడికే ఆజ్ఞాపించడం తెలుస్తుంది. ముందు విధేయత నేర్చుకోండి.

ఇక్కడ ప్రతివాడికీ నాయకత్వం కావాలి. ఎవ్వడూ ఆజ్ఞలను అమలు పరచడు. మహాకార్యాలను సాధించాలంటే నాయకుని ఆదేశాలను తుచ తప్పకుడా పాటించాలి. నాభవిష్యత్ జీవితమంతటినీ మఠంలోని మురికి కాలువలు శుభ్రపరచడంలో గడపమని మా గురుదేవుల నన్నాజ్ఞాపిస్తే మారు మాటాడకుండా శిరసావహిస్తాను. ఊరికే చెప్పడంకాదు. చేసి తీరుతాను. ఈ విధేయగుణాన్ని అలవరచుకోండి.

## విమర్శలు కట్టిపెట్టండి

మనము చేతులు ముడుచుకొని కూర్చుంటాము గాని ఏ పనీ చెయ్యము. ఎవరైనా చేస్తుంటే తప్పులు వెదకి అవహేళన చేస్తాము. ఈ దోషమువలన జాతి పతనావస్థకు వచ్చింది.

ఎవరి ఉత్సాహాన్నయినా చల్లార్చకండి. విమర్శపూర్తిగా మానివేయండి. అవతలివాళ్లు చేస్తున్నపని మంచిదిగా తోచినపుడు మీకు వీలైన సహాయం చేయండి. వాళ్లు తప్పుత్రోవన పోతున్నట్లనిపిస్తే మృదువుగా వాళ్లదోషాలు వారికి చెప్పండి. పరస్పర విమర్శయే సర్వానర్థాలకు దారితీస్తుంది. సంస్థల విచ్ఛిత్తికి అదే మూలకారణం.

## కార్యకర్తలకు మూడు సూచనలు

1. అనర్థానికి మూలహేతువు పక్షపాతమే. ఏ ఒక్కడినైనా మరొకడి కంటె ఎక్కువగా ప్రేమించానో, భవిష్యత్తులో ఇబ్బందులకు బీజములు నాటినట్లే. తన అనుచరులను తారతమ్య భావంతో ప్రేమించేవాడు ఎన్నడూ నాయకుడు కాలేడు.

2. నీదగ్గిరికెవరైనా వచ్చి తోటి కార్యకర్తలను గురించి చెడు చెప్పడానికి పూనుకుంటే ఎన్నడూ వినిపించుకోవద్దు. పూర్తిగా నిరాకరించి పంపివేయి, ఊరికే వినడం కూడా మహా పాపం.

3. అందరి లోపాలను సహించడం నేర్చుకో. కోట్లకొలది దోషాలను క్షమించు. నిస్స్వార్థంగా నీవందరినీ ప్రేమిస్తుంటే క్రమ క్రమంగా వాళ్ళందరూ ఒకరినొకరు ప్రేమించుకుంటారు.

## నాయకుని లక్షణాలు

నాయకుడు శీలవంతుడు కాకపోతే అనుచరులు విధేయులు కావడం సాధ్యం కాదు. నాయకుని శీలము పవిత్రమైన కొద్దీ అనుచరుల విశ్వాసమూ విధేయతా పెంపొందుతాయి.

సంఘాలు ఏర్పాటు చేయడం, ప్రణాళికలు తయారు చేయడం కష్టమేమీ కాదు. వివిధ మనస్తత్వాలు గల మనుష్యులను సమానాంశాలు పురస్కరించుకొని అందరినీ కలిసి ఒక త్రాటి మీద నడిపించడమే కష్టం. అందులోనే నాయకుని శక్తి పరీక్షింపబడుతుంది.

నాయకుని పాత్ర నిర్వహించడం చాల కష్టమైనపని. దాసాన దాసుడుగా మెలగుతూ వెయ్యిరకాల మనస్సులను సమన్వయ పరచుకుంటూ పోవాలి. అందరికీ సేవకుడైన వాడే వారికి నిజమైన యజమాని. అసూయగాని స్వార్థంగాని లీలగానైనా పొడసూపగూడదు.

## నాయకుడు పోరాటంలో ముందుండాలి

---

భారతదేశంలో సిపాయి కలహం జరుగుతున్నపుడు జనరల్ స్టార్లింగ్ అను ఆంగ్ల సేనాని వుండేవాడు. అతడు ఆ యుద్ధాల గురించి అనేక కథలు చెప్పేవాడు.

ఒకరోజున సంభాషణలో "సిపాయీలకు సమృద్ధిగా తుపాకులు, మందుగుండు సామగ్రి, ఆహార పదార్థాలు అన్నీ అందుబాటులో

వున్నాయి గదా. పైగా అందరూ శిక్షణ పొంది ఉన్నారాయె. ఐనావాళ్లు ఓడిపోవడం ఎలా జరిగింది?" అని అడిగాను.

"సిపాయీల నాయకులు ముందుండి నడపడం బదులు వెన కెక్కడో సురక్షిత స్థానాలలో ఉండి, 'దూకండి, పొడవండి, ధైర్యంతో పోరాడండి' అంటూ అరుస్తూ కూర్చున్నారు. ఆజ్ఞాపించేనాయకుడు ముందుండి మృత్యువు నెదుర్కోకపోతే అనుచరులు హృదయపూర్వకంగా ఎప్పుడూ యుద్ధం చెయ్యరు." అని సమాధానం చెప్పాడాయన.

యుద్ధంలోనే కాదు. ఏ రంగంలో నైనా మనుష్య స్వభావం యిలాగే వుంటుంది. నాయకుడు తలతరిగి యిచ్చేవాడు కావాలి.

ఒక లక్ష్యంకోసం నీ జీవితాన్ని నీవు అర్పించగలిగితే నీవు నాయకుడవు కాగలవు. కాని అవసరమైన త్యాగం చెయ్యకుండా నాయకులం కావాలని మనకందరికీ ఉంది. అపుడు ఫలితం శూన్యం. మనమాట ఎవరూ వినరు.

## 10. విద్యావ్యాప్తిద్వారా దేశాభ్యున్నతి

"పశ్చిమ దేశాల అభివృద్ధికీ సుస్థిరతకూ విస్తృత విద్యావ్యాప్తియే కారణం" అని చెపుతూ స్వామి వివేకానంద దేశంలో సరియైన విద్యావ్యాప్తి యొక్క అవశ్యకతను నొక్కి చెప్పారు.

"ప్రాక్ పశ్చిమ దేశాల నడుమ భేదమంతా ఇందులోనే వున్నది. వాళ్లవన్నీ జాతులు, మనకు జాతీయ భావమేలేదు. అంటే నాగరికతగాని, విద్యగాని పశ్చిమదేశాల్లో అందరికీ లభ్యమవుతాయి. జన

బాహుళ్యంలోకి గూడ వ్యాపిస్తాయి.

భారతదేశంలోను, అమెరికాలోను సమాజంలో ఉన్నత స్థాయిలో వున్న వాళ్లు ఒకే విధంగా వున్నారు. కాని నిమ్న స్థాయిలో వున్న వారి విషయంలోనే ఉభయదేశాలలో ఎంతో తారతమ్యం ఉన్నది.

భారతదేశాన్ని జయించడం బ్రిటిష్ వారికి అంత తేలిక ఎందుకయింది? వాళ్లొక జాతిగా (Nation) వున్నారు. మనం కాదు. ఇదే కారణం.

మనలో ఒక గొప్పవాడు చనిపోతే మళ్లీ అటువంటి వాడు రావడానికి శతాబ్దాలు పట్టుతాయి. వాళ్లదేశాలలో పోయినవాడి స్థానాన్ని మరొకరు వెంటనే ఆక్రమించగలరు. మనకీ గొప్పవాళ్ల కరువు ఎందుకువచ్చింది? వాళ్లకు ఎందుకు లేదు?

గొప్పవాళ్లను రూపొందించే విద్యారంగం యొక్క పరిధివారికి చాల విస్తృతంగా వున్నది. మనకు స్వల్పంగా వున్నది. ముప్ఫయి నలభై లక్షల జనాభాగల ఆయా జాతులలో వున్నంత మంది విద్యావంతులు 30 కోట్ల జనాభాగల మనజాతిలో లేరు. ఈ లోపాన్ని వెంటనే తొలగించాలి. జనసామాన్యం విద్యావంతులై ఉద్ధరింపబడితేనే జాతీయభావనకు అవకాశం ఉంటుంది.

## నేడుబోధింపబడేది నీరసమూనిర్జీవమూఅయినవిద్య

ఈనాటి విద్యావిధానంలో కొన్ని మంచి విషయాలున్నప్పటికీ, ఇందులో మహాదోషం ఒకటున్నది. ఇది మనిషిని సంస్కరించి సమర్థుణ్ణి చేసే విద్య కాదు. పైగా ఉన్న సామర్థ్యాన్ని పోగొట్టి నిర్వీర్యుణ్ణి చేసే విద్యయిది.

ఎందుకంటె, బడికి వెళ్లే ప్రతివాడూ మొదట నేర్చుకొనేది వాడి తండ్రి మూర్ఖుడనీ, తరువాత వాడి తాత పిచ్చి వాడనీ, ఆ తరువాత వాడి గురువులందరూ వంచకులనీ, చివరకు వాడి పవిత్ర గ్రంధాలన్నీ అబద్ధాల పుట్టలనీ! తత్ఫలితంగా వాడికి పదహారేళ్లు వచ్చే సరికి తన జాతికి వ్యతిరేకుడై ఆత్మవిశ్వాసహీనుడై నీరసంతో క్రుంగిపోతున్నాడు.

ఈ నాటి విద్య మనదేశంలో గొప్పవారు పుట్టారన్న పరిజ్ఞానమే మనకు కలిగించదు. మనజాతి పురోగతికి అనుకూలమైనదేదీ బోధింపబడడంలేదు. మనచేతులూ కాళ్లూ ఎలా ఉపయోగించుకోవాలో గూడ మనకు తెలియదు. ఇంగ్లీషు వాళ్ల పూర్వుల గురించిన ఘనత యావత్తూ వల్లె వేస్తాము. మన వాళ్లను గురించి పూర్తి నిర్లక్ష్యం చేస్తాము. దీంతో మనము దౌర్బల్యమే నేర్చుకుంటున్నాము. పరాధీన జాతి అయి నందువల్ల మనం బలహీనులమనీ ఎందుకూ కొరగాని వారమనీ నమ్మే స్థితికి వచ్చాము. ఈనాటి విద్యవలన కలిగిన ఫలితమిది.

## మనిషిని శీలవంతుణ్ణి చేసే విద్య

కేవలం కొంత సమాచారాన్ని బుర్రల్లో కుక్కితే అక్కడది గందరగోళం చేస్తూ జీర్ణం కాకుండా వుండిపోయేదికాదు విద్య అంటే. మనిషిని సంస్కరించి, శీలవంతుణ్ణి చేసి జీవితాన్ని చైతన్యవంతం చేసే భావపరంపరమే సరియైన విద్య. నాలుగైదు ఉత్తమ భావాలను వంట బట్టించుకొని జీవితాన్ని మలుచుకున్న వాడు యావత్తు గ్రంధాలయాన్ని వల్లెవేసిన వారికంటె ఉత్తమ విద్యావంతుడనడంలో సందేహంలేదు.

అందుచేత మనదేశంలో విద్య యావత్తూ అవి ఆధ్యాత్మిక

విద్యగాని లౌకిక విద్యగాని మన చేతుల్లో వుండాలి. అది జాతీయ పద్ధతులనే అనుసరిస్తూ జాతీయ ఔన్నత్యానికి మార్గదర్శకంగాను ఆచరణ యోగ్యంగాను వుండాలి.

## త్యాగశీలురు పేదలకు విద్యాబోధన చేయాలి

పేదలను విద్యావంతులను చేయడంలో పెద్ద సమస్యలే ఎదురవుతాయి.

ప్రతిగ్రామంలోను ఉచితంగా విద్యచెప్పే పాఠశాలలు పెట్టినా పేదల బిడ్డలు పనులు చేసుకోడానికి పోతారు గాని పాఠశాలలకు రారు. వాళ్లను పాఠశాలలకు రప్పించడమూ కష్టమే. దీనికొక పరిష్కారమున్నది.

వాళ్లు మనదగ్గరకు రాకపోతే మనమే వారి దగ్గరకు పోవాలి. పర్వంతం మహమ్మదు వద్దకు రాకపోతే మహమ్మదే పర్వంతం వద్దకు పోవాలి. బీదవాళ్లు ఎక్కడ ఉంటే అక్కడకు - పొలాలకు, కర్మాగారాలకు, ఇతర చోట్లకు విద్యాబోధకులే వెళ్లి బోధించాలి.

మన దేశంలో ఒంటరిగా వుంటూ ఆత్మార్పణం చెయ్యగల త్యాగశీలురు వేలకొలదివున్నారు. వాళ్లు సహజంగా గ్రామగ్రామానికీ తిరుగుతూ మతబోధ చేస్తుంటారు. వారు ఒక సంస్థగా ఏర్పడి మత బోధతో పాటు బీదలకు లౌకిక విద్యాబోధ చేస్తూ క్రమ శిక్షణ అలవరచాలి.

ప్రజలకు భావాలు అందించాలి. తమ చుట్టూ ప్రపంచంలో ఏమి జరుగుతున్నదో తెలుసుకొనే అవకాశం వారికి కలిగించాలి. ఈ మాత్రం పనిజరిగితే వాళ్ల అభ్యుదయానికి వారే కృషిచేస్తారు.

## ఇతరులనుండి నేర్చుకోవాలి

ఇతరుల నెందులోనూ అనుకరించవద్దు. స్వీయకృషివలన నిన్ను నీవు ఆవిష్కరించుకోవాలి గాని అనుకరించవద్దు. ఐతే ఇతరుల నుండి మనం నేర్చుకోవాలి. అనుకరణకూ నేర్చుకోడానికీ ఎంతో బేధం వున్నది.

విత్తనాన్ని భూమిలో పెట్టి గాలి సమృద్ధిగా లభించేటందుకు నేలను గుల్లగా జేసి కావలసిన నీళ్లు పోస్తాము. ఆ బీజం మొలకెత్తి చెట్టయి మహావృక్షమవుతుంది. గాలీ నీరూ వెలుతురూ - వీటి నుపయోగించుకొనే అది అంతవృక్షమయింది అయినా అది నీరు కాలేదు, మట్టి కాలేదు, గాలికాలేదు. వాటిలో ఏదీ కాదు. అన్నిటినీ వినియోగించుకొని తన స్వభావానికి అనుగుణంగా వృక్షంగా మారుతుంది. మనం చెయ్యవలసింది అదే.

అలాగే, ఇతరులనుండి మంచి విషయాలన్నీ నేర్చుకో. వాటిని నీలో ఇముడ్చుకొని నీ ప్రకృతికి అనుగుణంగా అభివృద్ధి చెందు. అంతేగాని యితరులుగా మారిపోకు. విదేశీవ్యామోహంతో హైందవ జీవనానికి దూరంకాదు. భారతీయులందరూ ఇతర జాతులవలె దుస్తులు ధరించి వారివలె మారిపోతే దేశం బాగుపడుతుందని ఎన్నడూ అనుకోకు.

## మనకు కావలసిన విద్యావిధానం

ఏ విద్య ద్వారానైతే శీలమేర్పడునో, మనశ్శక్తి పెంపొందునో, బుద్ధివికసించునో, మానవుడు స్వశక్తిపై నిలబడగలడో, అట్టి విద్య మనకవసరము.

మనలను ధీరులగ నొనర్చుటయే యావత్తు విద్యాభ్యాసమునకు

లక్ష్యముగా నుండవలయును. నిగ్రహము లేనందువల్లనే మనదేశములో అన్ని పనులు చెడిపోతున్నాయి. అస్ఖలతి బ్రహ్మచర్యము నవలంబించినచో విజ్ఞానమంతయు స్వల్ప వ్యవధిలో పొందవచ్చును. ఒక్కసారి వినినంతటనే ఏ విషయమైనను ముద్రవేసినట్లు మనస్సులో వుండిపోగలదు. ఏకాగ్రతగల మనస్సు ఆశ్చర్యకరమైన సామర్థ్యము, అతిగొప్ప ఇచ్ఛాశక్తి కలిగియుండును. కోరికల నదుపు చేసుకొన్నచో అత్యున్నత ఫలితముల సాధింపవచ్చును.

ప్రతివిషయములోను 'శ్రద్ధ' వహించుటకు ప్రయత్నించాలి. ఒక వ్యక్తికి మరొక వ్యక్తికి నడుమ గల తారతమ్యము వారికి వివిధ విషయాల యెడగల శ్రద్ధలోనే వుంటుంది. బ్రహ్మచర్యముతో బాటు శ్రద్ధ అలవడగలదు.

మానవుని శీలనిర్మాణములో మంచికీ చెడుగుకూ గూడ స్థానముంటుంది. కొన్ని సమయాలలో సుఖమువలన కంటె బాధలవలననే శీలము ముంచబడుతుంది.

ఉపాధ్యాయుని ఆదర్శజీవనము విద్యార్థి ఎదుట లేకుండ విద్య అనునదిలేదు. ఎవని శీలము మండుచున్న అగ్నికంటె పవిత్రమో అట్టి గురువు యొక్క సమక్షములో విద్యార్థి దశ గడపాలి. పూర్వము నుండియు మన దేశములో విద్యాబోధన చేయువారు స్వార్థ రహితులైన మహర్షులు. నేడుకూడ త్యాగుల భుజస్కంధముల మీదనే విద్యాబోధన చేయుభారముండవలెను.

ఉపాధ్యాయుడు బోధించునపుడు విద్యార్థి యొక్క స్థాయికి దిగివచ్చి, తన ఆత్మను విద్యార్థి ఆత్మతో సంధానపరచి, విద్యార్థి యొక్క మనస్సు ద్వారా తాను భావనచేయవలెను. అట్టి ఉపాధ్యాయుడు మాత్రమే నిజముగ బోధించగలడు.

# 11. వివిధ అంశములపై వివేకానందుని భావపరంపర

నా దేశములో ఒక కుక్క అయినను పస్తుపడి యున్నంత వరకు దానికాహారము నొసంగి రక్షించుటయే నా పరమధర్మము. ఇదియే నామతము. ఇందుకు భిన్నమైన దంతయు అధర్మము, కృత్రిమ ధర్మము.

*

అత్యంత అసాధ్యమైన ఆదర్శము ఎవ్వరికిని తగదు. బౌద్ధ జైన సంస్కర్తలు చేసిన పొరబాటు యిదే. ఐనను సాధ్యమగు విషయముల మీద మాత్రమే దృష్టి నుంచుటయు తగదు. ఉన్నతమైన ఆదర్శమును కలిగియుండి దానిని ఆచరణతో సమ్మేళన మొనరించుటకు ప్రయత్నించాలి.

*

"తమను నీతివేత్తలు దూషించవచ్చును; భూషించవచ్చును. లక్ష్మీ కటాక్షము కలుగునుగాక; ఇంట దారిద్ర్య దేవత తాండవించుగాక. ఇపుడే మరణము రానిమ్ము; యుగాంత ముందు వచ్చుగాక. ధీరులగు వారు న్యాయమార్గమును తప్పరు" అను భర్తృహరి పలుకులు మనకు వెలుగు బాటలుకావాలి.

*

మొదటిది ఆత్మవిశ్వాసము, తరువాతది భగవద్విశ్వాసము.

కార్యదక్షులు, దృఢగాత్రులు, బలోపేతులు నగు వారు పదిమంది యున్నచో ప్రపంచమును ఉల్లూతలూగింపవచ్చును. దయాపూర్ణ హృదయము, మేధాసంపద, భుజబలమూ - ఇవియే మనకు కావలసినవి.

*

తీవ్ర తపస్సు చేసి నేను గ్రహించిన మహత్తర సత్యమిది: ప్రతి జీవి యందును భగవంతుడు కలడు. కనిపించుచున్న సమస్త జీవ కోటియు అతని స్వరూపమే, భగవంతుని ఎచట వెదకుట? ఎవడు జీవారాధకుడో వాడే దైవారాధకుడు!

*

ఓ వీర భారతపుత్రా! 'నేను భారతీయుడను' అని గర్వింపుము. 'నేను భారతీయుడను, ప్రతిభారతీయుడును నా సహోదరుడు' అని సగర్వముగా ప్రకటింపుము, నీవు సగర్వముగా ఎలుగెత్తి యిట్లు ఘోషింపుము: 'భారతీయుడు నాసోదరుడు, నాప్రాణములకు ప్రాణము; భారతీయదేవతలే నా దైవతము. భారత సమాజము నా బాల్యడోలిక, యౌవనములో నందనవనము, వార్ధక్యములో వారణాసి!

*

త్యాగరహితమైన భక్తి పతన హేతువు; వినాశనమునకు పుట్టినిల్లు.

*

వ్యక్తులు గాని దేశాలుగాని తమ కాళ్లపై తాము నిలబడాలి. తమ మనుగడకే ఇతరులపై ఆధారపడే దేశాలు పతనం కాక తప్పదు.

*

తెరచుటకు అసాధ్యమైన కవాటములను సహితము ప్రేమ తెరువగలదు. విశ్వము యొక్క అన్ని రహస్యములకు ప్రేమయే ద్వారము.

*

క్రీస్తుమాటలు జ్ఞప్తికి తెచ్చుకో. 'అడుగు అడిగితే ఇవ్వబడు తుంది. ప్రయత్నించు - ప్రయత్నిస్తే లభిస్తుంది. తలుపు తట్టు - తట్టితే తెరువబడుతాయి! ఈ మాటలు ఊరికే అన్నవికావు. ఎత్తుకెత్తు పరమసత్యాలు.

*

## 12. వివేకానందునికి కలిగిన రెండు విచిత్ర అనుభూతులు

రాజపుత్ర స్థానములో పర్యటించు చుండగా వివేకానందునికొక చిత్రమైన అనుభవం కలిగినది.

అది మండువేసవి. మిట్టమధ్యాహ్నము. స్వామి టారీ ఘాటు స్టేషనులో దిగి నేలపై ఒక స్తంబమునానుకొని కూర్చొనివున్నాడు. ఎండ నిప్పులు కురియుచున్నది. మంచినీరు త్రాగుటకైనను ఆయనవద్ద పైసలు లేవు.

ఒక ధనవంతుడు ఎదురుగా కూర్చొని మధుర పదార్థములను తింటూ స్వామివంక చూస్తూ "అన్న పానీయాల లేకుండ మాడుటే సన్యాసుల గతి" అని ఎత్తి పొడుస్తూ అవహేళన చేశాడు. స్వామి ఏమియు పలుకలేదు.

అందులో ఒక మిఠాయి వర్తకుడు రుచికరమగు భోజనమును,

మధుర పానీయములను గొనివచ్చి స్వామి ఎదుట వుంచి "స్వామీ! వీటిని భుజించండి" అంటూ బ్రతిమాలాడనారంభించినాడు.

స్వామి అతనిని జూచి "మిమ్ము నేనెరుగను. మీరు ఎవరి ననుకొన్నారో, మీరు పొరబాటు పడివుంటారు" అని వాటిని తినకుండ తిరస్కరించాడు.

అందుకావర్తకుడు "స్వామీ! నాయిష్టదైవతమగు శ్రీరామ చంద్ర ప్రభువు నాకు స్వప్నములో కనిపించి స్టేషనులో వున్న మిమ్ము జూపి, అదిగో నిన్నటినుండి అతడు నిరాహారియై యుండు టచే నామనస్సు తల్లడిల్లుచున్నది. వెంటనే ఆహార పానీయములను గొనిపోయి ఆతనికందజేయు" మని ఆనతిచ్చాడు.

నేను నిద్రనుండి మేల్కొని ఇది స్వప్నమేగదాయను నిర్లక్ష్య ముతో మరల పడుకున్నాను. కాని శ్రీరామచంద్రుడు మరల నన్ను నిద్రనుండి తట్టిలేపుటచే ఆయన ఆజ్ఞానుసారము ఈ పదార్థములను తెచ్చినాను. దయచేసి భుజింపుడు" అని ప్రాధేయపడ్డాడు.

పరమేశ్వరుని కృపకు ఆశ్చర్యముతో కన్నీరు విడచుచు స్వామి ఆవర్తకునికి కృతజ్ఞత తెలిపి ఆతడు తెచ్చిన వాటిని భుజించు చుండ, లోభియగు ధనవంతుడు స్వామి పాదములపై మోకరిల్లి తన మూర్ఖ ప్రలాపములకు క్షమించమని వేడుకున్నాడు.

"ఎవరు ఇతర చింతలు లేక నన్నే ఉపాసింతురో వారి యోగ క్షేమములను నేనే వహిస్తాను' ' అని గీతలో శ్రీకృష్ణుని పలుకున కిది తార్కాణముగా నున్నది.

## మరియొక సన్నివేశము:-

రాజపుత్ర స్థానములో ఖేత్రినగరములో వరుసగా మూడు దిన

ములు స్వామి నిర్విరామంగా జనులకు ప్రబోధము లొనర్చుచున్నాడు. ఆయన భోజనము గురించి ఎవరును ఆలోచింపనేలేదు.

అపుడొక చర్మకారుడు స్వామి ఆకలిని గమనించి వారి ఎదుటకు పోయి "స్వామీ! మీరు భోజనము చేయకుండ కార్యక్రమాలలో నిమగ్నులైనారు. పంచముడనగుటచే మీకు భోజన మిడుటకు తగను. అందుచేత వండుకొనుటకు సంచారములను తెచ్చియిస్తాను. దయచేసి పుచ్చుకొనండి" అని అర్థించాడు.

ఒక సహృదయుడు ఆదరముతో తన ఆకలి తీర్చుటకు వచ్చెనని భావించి "నాయనా! నీవు తయారుచేసిన రొట్టెలను భుజిస్తాను. సంశయము వద్దు" అని చెప్పి ఆ హరిజనుని సమ్మతింపజేశాడు. అతడు తెచ్చిన ఆహారమును ప్రీతితో భుజించి కృతజ్ఞతా పూర్వకముగ కన్నీరు గార్చి "వేలకొలది ఇట్టి సహృదయులు గుడిసెలలో నివసిస్తున్నారు. వారిని మనము అంటరాని వారని నిరసించుచున్నాము. ఎంతటి అవివేకము!" అని విషాదం వెలిబుచ్చాడు.

మధ్యపరగణాలలో పర్యటించుచు స్వామి ఒకమారు పనీవాంద్రతో కలిసినివసించాడు.

## 13. వివేకానందుని హైదరాబాద్ పర్యటన

ఇప్పటి ఆంధ్రప్రదేశ్‌లో వివేకానందుడు హైదరాబాద్ నగరానికి మాత్రమే రావడం జరిగింది. కొందరు పురప్రముఖుల ఆహ్వానాన్ని పురస్కరించుకొని స్వామి 1892 ఫిబ్రవరి 10న హైదరాబాద్ విచ్చే

శారు. నైజాం ప్రభుత్వంలో సూపరింటెండెంట్ ఇంజనీరుగానున్న బాబూ మధుసూదన చటర్జీ గృహంలో విడిదిచేశారు. రైలుస్టేషను వద్ద నిజాం నవాబు ఆస్థాన అధికారులు, ప్రముఖ జాగీర్దారులు, వణిక్ప్రముఖులు, న్యాయవాదులు, వేదపండితులు మున్నగు 500 మంది పెద్దలు స్వామికి స్వాగతం పలికారు. వివేకానందుడు గోల్కొండ కోటను, సలార్ జంగ్ భవనమును, పలుహిందూ దేవాలయాలను, బాబా సరఫ్ ఉద్దీన్ సమాధిని సందర్శించారు.

ఫిబ్రవరి 13వ తేదీన సికింద్రాబాద్‌లోని మహబూబ్ కాలేజి ఆవరణలో "నా పశ్చిమ దేశ యాత్ర లక్ష్యం" గురించి ప్రసంగించారు. పండిట్ రత్తన్‌లాల్ సభకు అధ్యక్షత వహించారు. పలువురు యూరోపియన్‌లతో సహావెయ్యిమంది పురప్రముఖులు సభకు హాజరైనారు. స్వామివారికి ఆంగ్లభాషలోగల పాండిత్యమునకు, వాగ్ధాటికి సభికులు ముగ్ధులైనారు. మరునాడు బేగం బజారులోని సేఠ్ మోతీలాల్ నివాసములో వాణిజ్యవేత్తల సమావేశంలో స్వామి ప్రసంగించారు. థియొసాఫికల్ సొసైటీ, 'సంస్కృత ధర్మమండలి సభ' కార్యకర్తలు గూడ వారిని కలుసుకున్నారు.

ఫిబ్రవరి 12న నైజాంనవాబుకు బావమరదియు, ప్రముఖ జాగీర్దారును అగు నవాబ్ బహదూర్ సర్ ఖుర్షీద్ జా అమీర్-ఇ-కబీర్ స్వామి వారిని తన నివాసమున కాహ్వానించి రెండుగంటలపాటు హిందూ, ఇస్లాం, క్రైస్తవమత సిద్ధాంతములగురించి చర్చించారు. నిరాకారుడగు పరమేశ్వరుని సాకారునిగా అర్చించే పద్ధతి ఎలా రూపొందినదో వివేకానందుడు వివరించి చెప్పారు. స్వామి వారి అవధులులేని మేధాశక్తి నవాబును ఆకట్టుకొనుటచే "స్వామీ! మీ పశ్చిమ దేశ పర్యటనకై నేను వెయ్యిరూపయాలు సమర్పిం

పదలచినాను" అన్నాడు. ఇపుడుకాదని, సమయం వచ్చినపుడు స్వీకరించగలననీ స్వామి వారన్నారు.

వివేకానందుడు ఫిబ్రవరి 13న నైజాం సంస్థానపు దివాన్‌గా నున్న సర్ అష్మాన్ జాను కలుసుకున్నారు. పలువురు జాగీర్దారులు గూడ స్వామిని సందర్శించారు. ఫిబ్రవరి 17న వారు హైదరాబాద్ నుండి మదరాస్ తిరిగి వెళ్లారు.

వివేకానందునికి గల కంబుకంఠము, మధుర గానము, ఆత్మబలము, అనన్యమైన మేధాశక్తి, గంగార్ఝురి వంటి వాగ్ధాటి, మాటల నడుమ వారు ప్రయోగించే లోకోక్తులు, హాస్యోక్తులు, తడుముకోకుండ ఇచ్చే జవాబులు జనులను మంత్రముగ్ధులను చేసేవి.

## 14. లోకోత్తర పురుషుడు శ్రీరామకృష్ణుడు

వివేకానందుడంతటి విజ్ఞానరాశిని, మానవహృదయసామ్రాట్టును, భారతజాతి ఆశాజ్యోతిని రూపొందించి లోకానికందించిన శ్రీరామకృష్ణపరమహంస ఘనత ఊహకందనిది.

మహాత్మాగాంధీ పలుకులలో చెప్పవలెనంటే, "రామకృష్ణ పరమహంస జీవితచరిత్ర" ఆచరణ రూపమైన మత చరిత్ర. ఆయన జీవితము మనల్ని భగవంతుని ముఖాముఖి చూసేటట్లు చేస్తుంది...... రామకృష్ణుడు దివ్యత్వము యొక్క సజీవాకృతి. ఆయన ఉపదేశములు కేవలము పండితవాక్కులుకావు. అవి ఆయన స్వీయ అనుభూతులకు నిదర్శనములు. అందువల్ల అవి పాఠకుల మీద అప్ర

తిహతమైన ముద్రవేయును. సంశయాత్మకమైన నేటికాలమునకు రామకృష్ణుడొక ఉజ్జీవనమైన విశ్వాసమును ప్రదర్శించుచున్నాడు"

వివేకానందుడే ఒక ఉపన్యాసములో చెప్పినట్లు రామకృష్ణుడు 'గురుకుల గురువు' **Master of Masters**

శ్రీరామకృష్ణుని అసలు పేరు గదాధరుడు. ఈతని తండ్రి ఖుదీరాంఛటోపాధ్యాయ; తల్లి చంద్రమణీదేవి. 1836 ఫిబ్రవరి 18న హుగ్లీ జిల్లా కామార్పుకుర్‌లో ఈతడు జన్మించాడు. 1843లో తండ్రి ఆకస్మికముగ మరణించాడు. ఆయన మరణమ వలన పిన్న వయస్కుడగు గదాధరుని లేత మనస్సులో "జనన మంటే ఏమిటి?" మరణమంటే ఏమిటి?" అను ప్రశ్నలుదయించునవి. వీటి ప్రభావం వలన అతడు అంతర్ముఖుడైనాడు. చిన్నప్పటి నుండి భక్తి గీతము లాలపించి దైవ చింతనలో నిమగ్నుడయ్యేవాడు. "ఈ పొట్టకూటి చదువులు నాకక్కరలేదు. ఏ విద్యహృదయవికాసాన్ని కలిగించి వాంఛలన్నిటికీ అతీతమైన ఆధ్యాత్మిక సంతృప్తి కలిగిస్తుందో ఆ విద్యనే నేను అభ్యసిస్తాను" అనే నిర్ణయానికి వచ్చాడు. 1855లో కలకత్తా సమీపంలోని దక్షిణేశ్వరంలో రాణీరాస్మణీదేవి నిర్మించిన కాళికాదేవి ఆలయంలో పూజారిగా చేరి జీవితాంతము అచటనే ఉండిపోయాడు.

శ్రీరామకృష్ణుని వాక్కులు అమృత గుళికలు. చక్కని ఉపమానములలో శ్రోతల మనస్సుల మీద చెరగని ముద్రలు వేయుచుండెడివి. అట్టి బోధనలలో కొన్ని యివి:

1. దేనినీ హీనముగా చూడకు. ఎందుకంటే, వడ్లగింజల్లో బియ్యపు గింజలే ప్రధానములని వాటిని గ్రహించి పైనున్న పొట్టును అప్రధానమనుకొని అవతల పారబోస్తాము. కాని పైనున్న పొట్టు

లేనిచో వడ్లుగింజమొలకెత్తదుగదా!

2. ధనమునకు ఎవడు దాసుడుకాడో, ధనమెవ్వనికి దాస్యము చేయునో వాడే నిజమైన మానవుడు. ధనమును సరిగా వినియోగించుట ఎరుగని వానిని మానవుడన తగదు.

3. పరమేశ్వరుని ఎదుట యుక్తి, ధీశక్తి, పాండిత్యము, ఇవేవియు కొరగావు. అచట మూగవాడు మాట్లాడును, గ్రుడ్డివాడు చూచును, చెవిటివాడు వినును.

4. చేటవలె ప్రవర్తింపుము. తేలికైన పదార్థములను పనికిరాని పొల్లును విడిచి ఘనమై ఉపయుక్తములగు పదార్థములను చేట తనలో నిలుపుకొనును. ఉత్తములైన వారి స్వభావ మిట్లుండును.

5. దివ్యజనని అనేకమంది పిల్లలను పెంచుతున్న గృహిణి వంటిది. ఆ గృహిణి పిల్లలను ఆటపాటల్లో పెట్టి తన పని చేసుకోడానికి వెళ్లిపోతుంది. ఈ పిల్లలు బొమ్మలతో ఆడుకుంటూ మిఠాయీలు తింటూ ఎంతో సేపు కాలంగడుపుతారు. ఆటలు మరిగి అమ్మను మరిచిపోతారు. చివరకు ఏదో బిడ్డకు ఆకలయి అమ్మతలపుకురాగానే ఏడుస్తుంది. బిడ్డ ఆకలితో నిజంగా ఏడ్చిన ఏడుపు ఆతల్లికి తెలుసు. వెంటనే పరుగెత్తుకొనివచ్చి చంకనెత్తుకుంటుంది. దివ్యజనని అటువంటిది.

6. దేవుడు అంతటా వ్యాపించివుండగా వేరే దేవాలయాల అవసరం ఏమిటో చెపుతూ ఇలా అన్నారు: "ఆవు శరీరంలో రక్తం ద్వారా పాలు దాని శరీరమంతటా వ్యాపించివున్నాయి. కాని దాని చెవులు గాని కొమ్ములు గాని పితకటం వలన పాలురావు. అదే విధంగా భగవంతుడు సర్వత్రా వ్యాపించి వున్నప్పటికీ నీవు భగవం

తుని అన్నిచోట్ల చూడలేవు. ప్రాచీనకాలంనుండి భక్తుల ఆధ్యాత్మిక సాధనవలన, వారిజీవితాలవలన పావనమైన దేవాలయాలలో భగవత్ శక్తి ఎక్కువగా ప్రస్ఫుటమవుతుంది."

## 15 ముచ్చటైన మూడుకథలు

శ్రీరామకృష్ణ పరమహంస చెప్పిన అనేక కథలలో మానవజీవితానికి అన్వయించుకొని నిరంతరం గుర్తుంచుకోదగిన మూడు కథలను తెలుసుకుందాము.

### గర్వానికి విరుగుడు

అదొక పల్లెటూరు. అప్పుడే సూర్యుడస్తమించాడు. చీకటి నలుదెసల అలుముకొనుచున్నది. వీధి దీపాలుగూడలేని కుగ్రామమది.

పొలాలకు వెళ్లిన కర్షకులు గేదెలను తోలుకొని ఇళ్లకు వస్తున్నారు. దోవసరిగా కానరావడంలేదు.

మిణుగురు పురుగులు ఆ చీకటిలో ఎగురుతూ అందమైన వెలుగులనిస్తున్నాయి. "మేం వెలుతురిస్తున్నాం; మేము వెలుతురిస్తున్నాం" అని గర్వంతో ఎగురుతున్నాయి.

కొద్దిసేపటికి ఆకాశంలో నక్షత్రాలు మినుకుమినుకు మని ప్రకాశిస్తున్నాయి. నక్షత్రాల వెలుగులో కొద్దిగా దోవకనిపిస్తున్నది. అంతటితో మిణుగురు పురుగుల గర్వం అణిగింది.

"ఈ చీకటిలో మేము వెలుగునిస్తున్నాం, మేము వెలుగునిస్తున్నాం" అని నక్షత్రాలు గర్వించాయి. తమవల్లనే బాటసారులకు

దోవకనిపిస్తున్నదని పొంగిపోతున్నాయి.

మరికొంతసేపటికి తూర్పుదిక్కున చంద్రుడుదయించి పిండారబోసినట్లు వెన్నెలను నలుదిక్కులా ప్రసరింపజేస్తున్నాడు. అంతటితో నక్షత్రాల గర్వం సమసిపోయింది.

"నేను వెన్నెల యిస్తున్నాను" అని చంద్రుడు గర్వించాడు. తన వెన్నెల వల్లనే భూమిమీద జనులు ఆనందంగా వున్నారని అనుకున్నాడు.

కొలది గంటల అనంతరం తూర్పు దిక్కున సూర్యుడదయించాడు. అంతటితో చంద్రుని గర్వం అణిగిపోయి ప్రకాశాన్ని కోల్పోయాడు. చంద్రుడు వెలవెలాపోయాడు.

ప్రకృతిలోని ఈ సన్నివేశాన్ని గమనించి ఎవరూ గూడా తమకు ధనం వున్నదనీ, విద్యవున్నదనీ, అందం వున్నదనీ గర్వించరాదని శ్రీరామకృష్ణుడు చెప్పాడు. ఆయా విషయాలలో తమకంటె అధికులతో పోల్చుకుని గర్వాన్ని దరిజేరనివ్వ వద్దని బోధించాడు.

## సన్యాసానికి అర్హత

ఒక వ్యక్తి ఇంట్లో భార్యా బిడ్డలతో వేగలేక రామకృష్ణుని వద్దకు వచ్చి "స్వామీ! నాకు దీక్ష యివ్వండి. నేను సన్యాసం పుచ్చుకుంటాను" అని అడిగాడు.

అందుకు రామకృష్ణుడు ఇలా జవాబు చెప్పాడు: "నాయనా! జీవితమంటే ఏమిటి? మంచి చెడుల నడుమ జరిగే సంగ్రామమే జీవితం. సన్యాసి అయినా, గృహస్థు అయినా చేయవలసినదీ యుద్ధమే. విజయం పొందవలసినది చెడుమీదనే.

ఐతే సన్యాసి అయినవాడు మైదానములో శత్రువు మీద బహిరంగ యుద్ధం చేస్తాడు. అట్లు చేయుటకు ఎంతో ధైర్యసాహసాలు, బలపరాక్రమాలు, కావాలి. అందరూ అలా చేయలేరు.

గృహస్థు కోటలో ఉండి శత్రువుతో పోరాడుతాడు. అలా పోరాడడం సులభం. కోట యొక్క రక్షణ అతనికుంటుంది. సంసారమే ఆకోట.

రోజులో 16 గంటలు దేవుడు తప్ప మరొక ఆలోచన లేనివాడే సన్యాసానికి అర్హుడు అతడు తన సర్వస్వమును భగవదర్పితంచేసి చెడుమీద సమరం సాగిస్తాడు. మిగిలిన వారందరూ గృహస్థులుగా వుండి దుర్గుణములపై సమరం సాగించాలి" అని అన్నారు.

## 3. విశాలదృష్టి ఆవశ్యకత

మానవులు సంకుచిత దృష్టిని విడనాడాలి అని చెపుతూ ఈ క్రింది కథను చెప్పారు.

ఒక బావిలో ఒక కప్ప నివసిస్తున్నది. అది అక్కడే పుట్టి అక్కడే పెరిగింది. దానికా బావి తప్ప మరొక జలాశయం తెలియదు.

ఒకనాడు సముద్రంలో వుంటున్న మరొక కప్ప ఆ బావిలో పడింది.

"నీవెక్కడనుండి వచ్చావు?"

"సముద్రం నుండి"

"సముద్రమా? అది నాబావి అంత పెద్దదా?" అంటూ బావిలోని కప్ప ఒక ప్రక్కనుండి మరొక ప్రక్కకు దూకింది.

"మిత్రమా! ఈ చిన్న బావితో సముద్రము నెట్లు పోల్చగలవు?" అని సముద్రమునుండి వచ్చిన కప్ప చెప్పగా, బావిలోని కప్ప మరల ఒకమూలనుండి మరొకమూలకు దూకి, "సముద్రమంత పెద్దదా?" అన్నది.

"ఏమి వెఱ్ఱి మాటలు మిత్రమా! సముద్రమును ఈ బావితో పోల్చుతావా?"

అపుడా బావిలో కప్ప "బాగుంది బాగుంది. నా బావికంటె ఏదీ పెద్దదిగా ఉండదు. నీవు అబద్ధమాడుతున్నావు. నిన్ను గెంటివేయాలి" అన్నది.

ఇలాంటి సంకుచత్వానికి మనము దాసులము కారాదని రామకృష్ణుడీ కథ చెప్పారు.

## 16. భారత జాతీయోద్యముపై వివేకానందుని ప్రభావం

1885లో భారత జాతీయ కాంగ్రెస్‌ను స్థాపించారు. అయినా అది బ్రిటిష్ పరిపాలనను మెరుగుపరచే రాజకీయ సంస్కరణలను కోరిందేగాని స్వతంత్రం కావాలని కోరలేదు.

1893 సెప్టెంబరులో చికాగో సర్వమత మహాసభలో వివేకానందుని చరిత్రాత్మక ఉపన్యాసం భారత జాతీయోద్యమానికి ఒక క్రొత్త ఊపిరి పోసింది. ఆత్మస్థైర్యాన్ని కలిగించింది. నాయకుల వెన్ను తట్టి ముందుకు నడిపించింది.

వివేకానందుడు రాజకీయ నాయకుడు కాడు. ఐనా ఆయన ప్రసంగాలలో అడుగడుగునా దేశభక్తి తొణికిసలాడేది. ఆతడు దేశభక్తుడైన సన్యాసి. ఆతని అమృత వాక్కులు జాతీయనాయకు లందరి హృదయాలపై చెరగని ముద్రను వేశాయి.

అది 1893 సెప్టెంబరునెల. పూనాలో "కేసరి" కార్యాల యంలో తిలక్ మహాశయుడు దినపత్రిక చూస్తూ వున్నాడు.

చికాగోలో జరుగుచున్న సర్వమత మహాసభ వార్తలు ఆనాటి దినపత్రికలో ప్రముఖంగావచ్చాయి.

అందులో ఒక హిందూ యువక సన్యాసి ఫోటో వున్నవి. ఈయువక సన్యాసి కేవలము ఐదు నిముషాల ఉపన్యాసంతో అశేష ప్రేక్షకులను ఎలా ఆకర్షించాడో గూడ అచట వర్ణింపబడివున్నవి.

తిలక్ హృదయం ఆనందంతో ఉప్పొంగింది. ఆయన కపుడు గుర్తొచ్చింది. ఆశ్చర్యం! అతడేగత సంవత్సరం పరివ్రాజకుడుగా దేశపర్యటన చేస్తూ తన యింటికి వచ్చి కొన్నాళ్ల పాటున్నాడు.

బొంబాయి నుండి పూనా వచ్చే రైలుబండిలో ఈ యువక సన్యాసి తనను కలుసుకున్నాడు.

తాను అతని పేరడిగాడు. అతడు నిదానంగా "సన్యాసికి పేరే మిటి?" అన్నాడు.

తర్వాత అతడు తన యింట పది దినములున్నాడు. వేదాలు, ఉపనిషత్తులు, హిందూ ధర్మము గురించిన చర్చలు జరిగాయి. అతడీ మహారాజయోగియగు వివేకానందుడు.

కలకత్తాలో కాంగ్రెస్ మహాసభలకు హాజరైన పిదప లోకమాన్య తిలక్ స్నేహితులతో బాటు బేలూరు మఠానికి వెళ్లి వివేకానందుని

కలుసుకున్నాడు. స్వామి వారిని ఆదరంతో ఆహ్వానించాడు.

వివేకానందుడు ప్రత్యక్షంగా జాతీయోద్యమంలో పాత్ర వహిం చలేదు. కాని రూసో రచనలు ఫ్రెంచి విప్లవానికి దోహదము కలిగించినట్లే వివేకానందుని భావ పరంపర జాతీయోద్యమానికి పుష్టిని చేకూర్చినది.

1902లో స్వామి సమాధి చెందారు. కాని ఆయన ప్రభావం ఆతరువాత గూడ కాంగ్రెస్‌లోని అతివాద మితవాద నాయకు లపై అత్యధికంగా పడింది.

1912లో తిలక్ 'మరాఠా' పత్రికలో "స్వామి వివేకానం దుడు భారత జాతీయతకు తండ్రివంటివాడు. Father of Indian Nationalism ఆధునిక భారత పితయగు నీతనిని జూచి ప్రతిభా రతీయుడు గర్విస్తాడు" అని వ్రాశాడు.

స్వదేశీ ఉద్యమకాలంలో నిప్పులు చెరిగే ప్రసంగాలు చేసిన బిపిన్ చంద్రపాల్ 1916లో 'కామన్‌వీల్' పత్రికలో ఇలా వ్రాశాడు: "ఆధునిక భారత జాతీయతకు వివేకానందుడు అతి గొప్ప ప్రచా రకుడు మరియు ప్రవక్త. జాతీయోద్యమ వ్యాప్తికి అత్యవసరమైన జ్వలించే దేశభక్తిని జనులలో రగుల్కొల్పిన మహనీయుడాయన"

"వివేకానందుడే నాగురువు" అని స్పష్టంగా ప్రకటించిన దేశ బంధు చిత్తరంజనదాస్ దరిద్రనారాయణ సేవను రాజకీయ కార్యక లాపంతో మిళితం చేశాడు. జాతీయోద్యమంలో కార్మికులనూ కర్ష కులనూ భాగస్వాములుగా చేశాడు. వివేకానందుని నుండి ఆతడు పొందిన స్ఫూర్తి యొక్క ఫలితమిది.

ఆనాటి విప్లవకారులకు సైతం వివేకానందుని ఉపన్యాసాలు

పాఠ్యభాగాలుగా ఉపకరించాయి. వివేకానందుని రచనలు విప్లవకారుల నుత్తేజపరుస్తున్న కారణాన అంగ్ల ప్రభుత్వం స్వామీజీ లేఖల ప్రచురణను అడ్డుకోవాలనీ, శ్రీరామకృష్ణ మిషన్‌ను గూడ నిషేధించాలనీ యోచించింది.

వివేకానందుని శిష్యురాలగు సోదరి నివేదిత ఉత్తేజపూరిత ఉపన్యాసాల ద్వారాను, రచనల ద్వారాను విప్లవ కారులకు అండదండలు అందించింది. ఆమెను "విముక్తి పోరాటంలో పాల్గొంటున్న జ్వలించిన ఖడ్గం ధరించిన సైనికుడు" గా ఒక ఆంగ్ల రచయిత వర్ణించాడు.

స్వదేశీ ఉద్యమం విజయవంతం కావడానికి రామకృష్ణ వివేకానందుల స్ఫూర్తి దాని వెనుక వుండడమే కారణమని అరవింద ఘోష్ పేర్కొన్నాడు. "రామకృష్ణుడు మానవ రూపమెత్తిన దేవుడు; వివేకానందుడు ఆతని ప్రవక్త..... భవిష్యత్ భారతదేశానికి ప్రతినిధిగా వివేకానందుణ్ణి రామకృష్ణుడు తీర్చిదిద్దాడు...... తన యావత్తు శక్తిని ఈ నాయకునిలో ప్రవేశింపజేశాడు...... ఆశక్తియే ఇపుడు మధ్యాహ్న మార్తాండుని తీక్షణ కిరణములవలె యావత్తు దేశంమీద ప్రసారమవుతున్నది..... గుర్తుంచుకోండి...... వివేకానందుడు మరణించలేదు...... ఆతని ఆత్మ భరతమాత యొక్క, ఆమె బిడ్డల యొక్క ఆత్మలలో జీవిస్తున్నది" అని హృదయాలు ద్రవించేటట్లు అరవిందుడు వ్రాశాడు.

తన జీవితము వివేకానందుని ప్రభావముతో రూపొందినదనీ, యువకులు స్వామీజీని ఆదర్శంగా తీసుకొని ముందుకు నడవాలనీ సుభాస్ చంద్రబోస్ పేర్కొన్నాడు. వివేకానందుని జ్వలించుచున్న దేశభక్తి తన రక్తనాళాలలో లావావలె ప్రవహించి తనను ఉత్తేజప

రచి నడిపించినదని ఆయన చెప్పుకున్నాడు. "వివేకానందుడు నేడు వున్నట్లయితే నేనాయన పాదసన్నిధిలో ఉండెడివాడను. నేను అతి శయమేమీ చెప్పకపోతే - ఆధునిక భారతదేశము ఆయన సృష్టి" అని ఆయన వ్రాశాడు.

"దరిద్ర నారాయణ సేవయే నామతము" అని వివేకానం దుడు చేసిన ప్రకటనను ఆచరణలోకి తీసుకువచ్చినవాడు గాంధీ మహాత్ముడు. "కామ తృష్ణలేకుండా వైవాహిక జీవితము గడపుట" యను సిద్ధాంతమును శ్రీరామ కృష్ణ పరమహంస నుండి స్వీక రించి గాంధీజీ తన జీవితములో ఆచరించాడు.

"భారత దేశాన్ని గురించి తెలుసుకోవలెనంటే వివేకానందుని అధ్యయనం చేయండి" అని విశ్వకవి రవీంద్రనాథ్ టాగోర్ చెప్పిన మాట కాచివడపోసిన సత్యం!

ఈ పుస్తక రచనకు తోడ్పడిన గ్రంథములు:

1. Facets of Vivekananda
2. The Life of Swami Vivekananda
   by His Eastern and Western Disuples
3. Swami Vivekananda on India and her Problems
4. Vivekananda's Rousing call to Hindu Nation
5. శ్రీ వివేకానంద జీవిత చరిత్ర
6. శ్రీ రామకృష్ణ పరమహంస బోధామృతము
7. ఉత్తిష్ఠత -జాగ్రత

ప్రతిజీవియందును దివ్యత్వము గర్భితముగా నున్నది.

బాహ్యాంతరప్రకృతినంతయు నిరోధించి అంతర్గతమగు నీ దివ్యత్వమును వ్యక్తముచేయుటయే జీవితమునకు పరమావధి.

ఇందులకై కర్మ, ఉపాసన, యోగ, జ్ఞానమార్గములలో నొక్కటిగాని, కొన్నిటినిగాని, అన్నిటినిగాని అవలంబించి ముక్తులరగుడు.

మతమునకంతకు నిదియే సారాంశము. వాదములు, సిద్ధాంతములు, కర్మకలాపములు, గ్రంథములు, దేవాలయములు, విధులు — ఇవన్నియు అప్రధాన విషయములు.

—శ్రీ వివేకానందస్వామి